
GEMS
GEMS
Cadbury's
MILK CHOCOLATE

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>188, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. *Periodicity* of *Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. *Printer's Name* | ... | B. V. REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Prasad Process Pvt Limited<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Chandamama Publications<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. *Editor's Name* | ... | B. NAGI REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | 'Chandamama Buildings'<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries:<br>1. B. V. HARISH<br>2. B. V. NARESH<br>3. B. V. L. ARATI<br>4. B. L. NIRUPAMA<br>5. B. V. SANJAY<br>6. B. V. SHARATH<br>7. B. L. SUNANDA<br>8. B. N. RAJESH<br>9. B. ARCHANA<br>10. B. N. V. VISHNU PRASAD<br>11. B. L. ARADHANA<br>12. B. NAGI REDDI (JR) |

All Minors, by Trustee:
M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras-600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March* 1981

**B. VISWANATHA REDDI**
***Signature of the Publisher***

డాక్టరుగారూ! మా బొమ్మ పాపాయికి వంట్లో బాగాలేదు. కొంచెం చెక్ చేసి చెప్పండి సార్.

జ్వరంలాంటిదేం కాదు. కడుపులోనే ట్రబుల్. ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వండి. తగ్గిపోతుంది

ఇదివర్షాకాలం కదా డాక్టర్. ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా చలికాలమైనా, ఏ కాలమైనా సరే. పిల్లలకు కడుపులో ఎలాంటి ట్రబుల్ వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వండి.






100 ఏళ్లుగా మాతృలోకం విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS OPPL 3 /80 TE

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''ధర్మమార్గం''] కు ఆధారం కోలార్ కృష్ణఅయ్యర్ రచన.

దానధర్మాలు చేయగలిగిన శక్తివుండీ, పిసినిగొట్టుగా బతికే వ్యక్తి, కృత్రిమమార్గాల ద్వారా దానపరుడనిపించుకో చూస్తే, ఎలా నవ్వుల పాలవుతాడో, ''తగినశాస్తి'' అన్న కథలో స్పష్టీకరించబడింది.

## అమరవాణి

నాభ్యుత్థాన క్రియా యత్ర, నాలాపా మధురాక్షరాః,
గుణదోష కథానైవ, తత్ర హర్మ్యే న గమ్యతే.

[అతిథులను ఆప్యాయంగా పలకరించి, వారి యోగక్షేమాలు తెలుసుకొనడంలాంటి గౌరవమర్యాదలు చూపని ఇంటికి, వెళ్ళనే కూడదు.]

సంపుటి 68 మార్చి '81 సంచిక 3

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




CHITRA



# అంత సులువుగా మారడు

భీమాపురం లోని భీమయ్య ఎప్పుడూ దిగులుగా ఉండేవాడు. రామాపురం లోని రామయ్య ఎప్పుడూ సంతోషంగా వుండేవాడు. ఈ సంగతి తెలిసి భీమయ్య రామయ్యను గురించి తెలుసుకుందామన్న ఆసక్తితో రామాపురం వెళ్ళాడు.

భీమయ్య వెళ్ళే సరికి, రామయ్య మంచం మీద ఉన్నాడు. ఆయన కాలికి కట్టు ఉన్నది. "పొలంలో జారిపడ్డాను. ఎముక విరిగిందట. కదలకుండా మంచం మీద రెండు నెలలు ఉండాలిట!" అన్నాడు రామయ్య, భీమయ్య అడిగిన ప్రశ్నకు సమాధానంగా.

"అయ్యో, పాపం! చాలా కష్టం వచ్చింది మీకు," అన్నాడు భీమయ్య.

"కష్టమేమున్నదీ? ఇలాంటిదేదో అయితే తప్ప విశ్రాంతి తీసుకోను నేను! కాళిదాసుగారి మేఘసందేశం చదవాలని ఎన్నాళ్ళనుంచో నా కోరిక. అది ఇప్పుడు తీరుతున్నది," అన్నాడు రామయ్య.

ఇంతలో రామయ్య కొడుకు వచ్చి, "నాన్నా, నిన్ను ఆ సోమయ్య తిట్టుతున్నాడు!" అన్నాడు ఆవేశంగా.

"తిట్టితే తిట్టనియ్యరా! మనకేం నష్టం?" అన్నాడు రామయ్య.

"నిన్ను పనికిరాని చవట అంటున్నాడు!" అన్నాడు రామయ్య కొడుకు.

"వాడు అంటే అన్నాడులే. నేను చవటనేనని నువు చెప్పు!" అన్నాడు రామయ్య.

"వాడిచేత మాటలు పడి ఊరుకుంటే నువు చవటవేగా మరీ?" అన్నాడు రామయ్య కొడుకు.

"నేను చవటనే అయినప్పుడు వాడు అంటే మాత్రం తప్పేమిటి? ఉన్నమాటేగదా వాడన్నాడు?" అన్నాడు రామయ్య.

"వసుంధర"

"బాగుంది! వాడు అన్నంతమాత్రాన నువు అయిపోతావేమిటి?" అన్నాడు కొడుకు చిరాకుగా.

"అలాటప్పుడు వాడు అంటే మాత్రం నష్టమేమిటి?" అన్నాడు రామయ్య.

"నష్టమున్నా, లేకపోయినా, వాడు అలా అంటే ఎందుకు ఊరుకోవాలీ అంటాను," అన్నాడు రామయ్య కొడుకు.

"ఒరే, వాడు అసలు అలా ఎందుకంటున్నాడు? ఇదివరకు నన్నేమీ అనే వాడు కాడు గదా?" అన్నాడు రామయ్య.

"ఒకప్పుడు మనకు వాడికంటె తక్కువ పొలం ఉండేది. నువు కష్టపడి ఇప్పుడు వాడికన్న పెద్ద ఆస్తిపరుడివయావు. అదీ వాడి ఏడుపు!" అన్నాడు రామయ్య కొడుకు.

"చూశావా? ఎవడైనా మనని కారణం లేకుండా తిట్టుతున్నాడంటే, దాని వెనకాల కొంత కథ ఉన్నదన్నమాట! ఒకడు మనని ఉత్త పుణ్యానికి తిడుతున్నాడంటే, మనం చాలా ఉన్నతస్థితిలో ఉన్నామన్నమాట! అందుకు సంతోషించాలి గాని విచారించడమెందుకూ?" అని రామయ్య అడిగాడు.

"నువ్వింతే! అన్నింటికీ ఇలాగే చెబుతావు!' అంటూ దిగులుగా వెళ్ళిపోయాడు రామయ్య కొడుకు.

"లోతుగా ఆలోచిస్తే ఈ ప్రపంచంలో విచారించదగినది ఏదీ ఉండదు, భీమయ్యగారూ. ఇది నేను అనుభవం మీద తెలుసుకున్న సత్యం. దీనిని మీరు ఒప్పుకుంటారా?" అన్నాడు రామయ్య.

"మంచం మీది నుంచి లేవలేనిస్థితిలో మీ భార్య మీకు చక్కగా సేవలు చేస్తున్నది. ఎంత ఆవేశమున్నా మీ అబ్బాయి మీ మాట వింటాడు. మీలాగే దెబ్బతగిలి నేను మంచమెక్కితే, నా భార్య నాకు ఇలా సేవలు చేయదు. నా కొడుకు ఒక్కసారి కూడా నా మాట వినడు. నా దురదృష్టానికి నాకు చాలా బెంగగా ఉన్నది," అంటూ భీమయ్య సెలవు పుచ్చుకున్నాడు.







# తగిన శాస్తి

ఒక గ్రామంలో పాపన్న అనే మోతుబరి రైతు వుండేవాడు. అతడిలో ఏమాత్రం దాన గుణం లేకపోవటంతో, బిచ్చగాళ్ళు కూడా అతడి ఇంటి చాయలకు వచ్చే వాళ్ళు కాదు.

ఒకసారి వానలు లేక ఆ ప్రాంతాల కరువు ఏర్పడింది. గ్రామంలో కాస్త సంపన్నులైనవాళ్ళు, ఇంటి కింత ధాన్యం అని చందా వేసుకుని, కాటకం పాలైన పేదసాదలకు పంచాలనుకున్నారు. వాళ్ళు పాపన్న దగ్గిరకు వచ్చి సంగతి వివరంగా చెప్పారు.

పాపన్న మండిపడుతూ, "ఎవరి కర్మ వాళ్ళది. నేను కష్టపడి సంపాదించు కున్నది, యిలా అడ్డమైనవాళ్ళందరికీ ధర్మం చేయటానికా? ఇక ఎన్నడూ, యిలా చందాలంటూ నా ఇంటి కేసి రాకండి," అన్నాడు.

ఈ పిసినారి పాపన్నతో వాదించి లాభం లేదనుకుని, వచ్చినవాళ్ళు లోలోపల పాపన్నను తిట్టుకుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

ఆ తరవాత కొద్ది వారాలకు ఆ గ్రామా నికి ఒక సాధువు వచ్చి, రామాలయంలో మకాం పెట్టాడు. ఆయన పగలల్లా పూజల్లో, ధ్యానంలో కాలం గడిపేవాడు. రాత్రికి ఆలయానికి వచ్చిన వాళ్ళకు పురాణకథలు చెపుతూ, ఎవరికైనా ధర్మ సందేహాలు కలిగి ప్రశ్నించినప్పుడు వాటిని నివృత్తి చేస్తుండేవాడు.

సాధువు రోజూ నాలుగైదు అరటి పళ్ళూ, కొద్దిగా పాలూ ఆహారంగా తీసు కునేవాడు. అంతకుమించి ఎవరు ఏమి యిచ్చచూపినా, "బాబూ, యివన్నీ నా కెందుకు? తీసుకువెళ్లండి!" అంటూ ఒకసారి చేతితో తాకేవాడు.

న్యాయపతి జానకి

సాధువు ప్రవర్తన గ్రామంలో చాలా మందికి ఆయన మీద మరింత భక్తిశ్రద్ధలు కలిగేలా చేశాయి. ఆయన వద్దన్నకొద్దీ ప్రజల నుంచి కానుకలు మరింత హెచ్చుగా రాసాగాయి.

పట్టుబట్టలు నేసే వెంకటస్వామి, ఆయనకు పట్టుపంచ భక్తితో సమర్పించాడు. సాధువు దాన్ని తాకి, తీసుకుపొమ్మన్నాడు.

బంగారు నగలు చేసే గురుమూర్తి ఆయనకు కుండలాలు బహూకరించబోతే, యింతే జరిగింది.

పెద్దశెట్టి కావిళ్ళతో ఏవేవో కానుకలు తెచ్చి, ఆయనకు సాష్టాంగపడ్డాడు. సాధువు ఆ కానుకల కేసి ఒకసారి చూసి, వాటి మీద కమండలం లోని నీళ్ళు చల్లి, ఎత్తుకుపొమ్మన్నాడు.

సాధువు మీద గ్రామంలో మరింత భక్తి గౌరవాలు పెరిగాయి. ఆయన చేత్తో స్పృశించిన కానుకలు ఇళ్ళకు తెచ్చుకున్న వాళ్ళకు, ఎన్నెన్నో మేళ్ళు జరుగుతున్నట్టు గ్రామంలో వార్తలు ప్రచారం కాసాగాయి.

రామాలయంలో చేరిన సాధువును గురించిన వార్తలు విన్న పాపన్నకు ఒక ఆలోచన వచ్చింది. తాను పిసినారి కాదనీ, అర్హులైన యిలాంటి సాధువులకు ఎంత విలువైన కానుకలైనా సమర్పించుకోగలననీ, పదిమంది ఎదటా రుజువు చేయాలనుకున్నాడు. ఎలాగూ తానివ్వబోయే



కానుకలు సాధువు పుచ్చుకోడు గనక, వాటిని తాను తిరిగి తన ఇంటికి తెచ్చుకో వచ్చు!

పాపన్న యిలా ఆలోచించి ఒక బండి మీద నవధాన్యాలతో నింపిన కొన్ని బస్తాలూ, కొత్త బట్టలూ, పళ్ళూ ఫలాలూ, ఒక చిన్న పెట్టెలో కొన్ని వెండి నాణాలూ వేసుకుని సాధువు దగ్గిరకు పోయి, సాష్టాంగపడి లేచాడు

సాధువు, చేఎత్తి దీవిస్తున్నంతలో, పాపన్న, "తమబోటి మహనీయుల్ని దర్శిస్తే, సాక్షాత్తూ దేవుణ్ణి దర్శించినట్టే! మహాత్ముల దర్శనానికి ఒట్టి చేతులతో పోగూడదన్నారు, పెద్దలు. తమరు యీ భక్తుడి మీద దయవుంచి, ఈ బండిలో తెచ్చిన కానుకలు స్వీకరించండి," అన్నాడు.

సాధువు, యీ పిసినారి పాపన్నను గురించి వినివున్నాడు. అంతేగాక పాపన్న ఎత్తుగడ కూడా అర్థమైంది. ఆ కారణంగా ఆయన, పాపన్నతో, "నాయనా, నీ భక్తి మెచ్చదగింది. ఇవాళే నా వ్రతదీక్ష ముగిసింది. అందువల్ల నువు భక్తితో సమర్పించిన, యీ కానుకలు తప్పక స్వీకరిస్తాను!" అని, లేచి వెళ్ళి, బండి మీద వున్న వస్తువుల మీద కమండలంలోని నీళ్ళు చల్లాడు.

సాధువు మాటలు అర్థంకాక పాపన్న గొడవపడుతున్నంతలో, సాధువు అక్కడ వున్న భక్తులతో, "నాయనలారా, అలా చూస్తూ నిలబడ్డారెందుకు? వెంటనే యీ భక్తుడు సమర్పించిన కానుకలను, గ్రామంలోని బీదవాళ్ళకు పంచిపెట్టండి," అన్నాడు.

పాపన్న కొయ్యబారిపోయి చూస్తూండగా, నలుగురూ చేరి బండి మీద వున్న వస్తువులన్నీ దించి, రామాలయం మంటపం మీద పెట్టారు. ఆ సాయంత్రం పాపన్న పుట్టెడు దిగులుతో, ముసుగుతన్ని ఇంట్లో పడుకుని వుండగా, రామాలయం ముందు అవన్నీ గ్రామంలోని పేద సాదలకు పంచిపెట్టబడినై.






# 11

[చతుర్నేత్రుడూ, సమరసేనుడూ కొండపైన వుండగా, ఆ ప్రాంతానికి వచ్చిన ఏకాక్షిమాంత్రికుడు, కుంభాండుణ్ణి అడ్డగించాడు. సమరసేనుడు, కుంభాండుడి మీదా, అతడి ఆటవికుల మీదా దాడి చేశాడు. ఆటవికులు కొందరు మరణించారు. నెత్తురువాసన పసిగట్టిన తోడేళ్ళ గుంపు ఒకటి అటురాగానే, అందరూ చెల్లాచెదురుగా పారిపోసాగారు. తరవాత—]

సమరసేనుడూ, సైనికులూ కొంతదూరం పరిగెత్తి, ఒక చోట ఆగారు. దూరంగా కుంభాండుడి ఆటవికుల కేకలు వినబడుతున్నవి. వాళ్ళు, తమ వెంటపడడం మాని, తోడేళ్ళ నుంచి ప్రాణరక్షణకు, దిగువనున్న అడవికేసి పారిపోతున్నారని, సమరసేనుడు గ్రహించాడు. మాంత్రికుల జాడలేదు. తోడేళ్ళు మాత్రం యింకా భయంకరంగా అరుస్తూనే వున్నవి.

అలిసిపోయిన సైనికులతోపాటు సమరసేనుడు ఒక చెట్టు కింద విశ్రమించాడు. ఆలోచించగా—కుంభాండుడు కూడా ధనరాసులున్న నావను వశపరచుకోవాలని గట్టి ప్రయత్నం ప్రారంభించాడని, సమరసేనుడికి అర్థమైంది. ఇక యిప్పుడు ఆ నావ కోసం ఆరాటపడేవాళ్ళు నలుగురయ్యారన్నమాట; తనూ, కుంభాండుడూ, ఏకాక్షి, చతుర్నేత్రుడూ !




సమరసేనుడు యిలాంటి ఆలోచనలలో వుండగా, సైనికులు మాత్రం తమ ద్వీపానికి ఎంత త్వరగా పోదామా అన్న ఆతృతలో వున్నారు.

''సేనానీ, మనం యీ భయంకర ద్వీపాన్ని త్వరగా వదిలిపోవడం మంచిది. అందుకు తగిన ప్రయత్నాలు చేయండి,'' అన్నాడొక సైనికుడు.

మేం అందరం కోరేది అదేనన్నట్టుగా మిగతా సైనికులు తలలు వూపారు. ఇది గమనించిన సమరసేనుడు, సైనికులతో, ''తొందరపడకండి. ఈ ద్వీపాన్ని వదిలిపోవడం క్షేమం అని ఏనాడో నిర్ణయించుకున్నాం. దాన్ని గురించి పదేపదే అనుకుని ప్రయోజనం లేదు. అసలు ప్రశ్న, యీ ద్వీపాన్ని వదిలిపోయేందుకు మార్గం ఏమిటన్నది,'' అన్నాడు.

ద్వీపాన్ని వదిలిపోయే మార్గం ఏమిటో సైనికులకూ తెలియదు. తాము సముద్ర తీరంలో వదిలివచ్చిన ఓడలు ఏ స్థితిలో వున్నవో వారెరగరు. ఏకాక్ష మాంత్రికుడి నుంచీ, కుంభాడుడి నుంచీ ప్రమాదం కలగకుండా చూసుకోవాలి. వాళ్ళ కంట బడకుండా తప్పించుకుపోవాలి.

''మనం యిక్కడి నుంచి తప్పించుకుపోయేందుకు చతుర్నేత్రుడు సాయపడలేడా?'' అని ఒక సైనికుడు, సమరసేనుణ్ణి అడిగాడు.

ఆ ప్రశ్నకు ఏమని జవాబివ్వాలో సమరసేనుడికి తెలిసింది కాదు. తమను యీ భయంకర ద్వీపం నుంచి, కుండలినీ ద్వీపం చేర్చమని చతుర్నేత్రుణ్ణి అర్థించడం వివేకం అవుతుందా? అంతే కాక, ఆ పని చతుర్నేత్రుడి కైనా సాధ్యమా అన్న అనుమానం కూడా, సమరసేనుడికి కలిగింది.

అందరూ యిలాంటి ఆలోచనల్లో వుండగా, ఎక్కడి నుంచో రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, సమరసేనుడి తలకు ఒక అడుగు ఎత్తులో, చెట్టు బోదెకు గుచ్చుకుపోయింది.

ఆ మరుక్షణం సమరసేనుడు ఎగిరి నిలబడి, "అందరూ చెట్ల వెనకకు తప్పుకోండి. ద్రోహి కుంభాండుడు ఎక్కడో పొంచి వుండి, మనను హతమార్చాలని చూస్తున్నాడు," అంటూ దాపులనున్న చెట్ల గుంపు కేసి పరిగెత్తసాగాడు.

సైనికులు తమ నాయకుణ్ణి అనుసరించి పరిగెత్తారు. ఆ మరుక్షణం, "పట్టుకోండి! ప్రాణాలతో వదలకండి!" అన్న కుంభాండుడి కేకలు వినిపించాయి.

ఈటెలు పట్టిన ఆటవికులు అడవి దద్దరిల్లేలా అరుస్తూ, చెట్లమాటు నుంచి బయటికి రాసాగారు.

సమరసేనుడు తాను చాలా ప్రమాదంలో చిక్కుకున్నానని గ్రహించాడు. తన వెంట వున్న ఐదుగురు సైనికులతో, అన్ని వైపుల నుంచీ చుట్టుముట్ట జూస్తున్న ఆటవికుల్ని ఎదుర్కోవడం క్షేమం కాదు. కుంభాండుడు, ఆటవికుల్ని హెచ్చరిస్తూ వెంట తగులుతున్నాడు.

గుబురుగా పెరిగిన చెట్ల నీడల్లో దాగుతూ, వీలయినప్పుడు పరిగెత్తుతూ, సమరసేనుడూ, సైనికులూ కొంత దూరం వెళ్ళారు. ఆ సరికి చంద్రకాంతి తగ్గిపోయి, క్రమంగా చీకట్లు ఆవరిస్తూండడం వల్ల, సమరసేనుడికి, కుంభాండుడి కంట బడకుండా తప్పించుకుపోవడం వీలయింది.

చివరకు అందరూ ఒకానొక కొండ గుహ ప్రాంతం చేరారు. కుంభాండుడూ,






ఆటవికులూ యింకా తమను వెంబడిస్తున్నట్టు, వాళ్ళ కేకలనుబట్టి గ్రహించారు. ఇంకా మరి కొంత దూరం పరిగెత్తడం కన్న, దాపులనున్న ఏ చీకటి గుహలోనో ప్రవేశించి, ఆ రాత్రికి అక్కడ కాలం గడపడం మంచిదనిపించింది, సమర సేనుడికి.

ఎదురుగా కనబడుతున్న గుహ కేసి సమరసేనుడు పరీక్షగా చూస్తున్నంతలో, సైనికులు తమ నాయకుడి ఆలోచన గ్రహించి, అటు కేసి నాలుగైదడుగులు వేశారు. వెంటనే సమరసేనుడు వాళ్లను, ''తొందరపడకండి, కొంచెం ఆగండి!'' అంటూ హెచ్చరించాడు.

''తొందరపడి గుహలో ప్రవేశించడం ప్రమాదకారణం కావచ్చు. ఆ గుహలో సింహం లాంటి ఏ క్రూరమృగమో వుండవచ్చు గదా!'' అన్నాడు సమరసేనుడు.

''సేనానీ, మరేం చేయాలి? కుంభాండుడు, ఆటవికులతో మన వెన్నంటి వస్తున్నాడు గదా?'' అన్నాడొక సైనికుడు, వెనుదిరిగి చూస్తూ.

''గుహలో సింహం వున్నదీ లేనిదీ తెలుసుకోవడం ఎలా? మరొక గుహ దగ్గిరకుపోయినా, యిదే సమస్య ఎదురౌతుంది గదా?'' అన్నాడు మరొక సైనికుడు.

సైనికుల ప్రశ్నలకు సమరసేనుడు చిరునవ్వు నవ్వాడు. తాను ముందుగా హెచ్చరించకపోతే వాళ్ళు గుహలోకి జొరబడడం జరిగి వుండేది. ఒకవేళ ఏ సింహమో, పులో అక్కడ వుంటే, వాళ్ళు దానికి ఎర అయిపోయి వుండేవాళ్ళు.

సమరసేనుడు విల్లంబులు చేతికి తీసుకుని, ''మీరందరూ కత్తులతో సిద్ధంగా వుండండి. నేను గుహలోకి బాణం కొడతాను. ఒకవేళ లోపల ఏదైనా కౄరమృగం వుంటే, అది హఠాత్తుగా మన మీదికి వచ్చిపడుతుంది. జాగ్రత్త!'' అన్నాడు.

సైనికులను యిలా హెచ్చరించి సమరసేనుడు గుహలోకి బాణం వదిలాడు.



మరుక్షణం, అతడు ఊహించినది నిజమని రుజువయింది. భయంకరంగా గర్జిస్తూ, సింహం ఒకటి చీకటి గుహ నుంచి బయిటికి దూకింది. కత్తులు దూసి సిద్ధంగా వున్న సైనికులు, అది తమ మీద దూకబోయేంతలో, కత్తులతో దాన్ని ఎదర్కొన్నారు. రెండు, మూడు కత్తి దెబ్బలు తిని సింహం మరింత పెద్దగా గర్జిస్తూ అడవిలోకి పారిపోయింది.

సమరసేనుడు యీసారి ఒక సైనికుడి నుంచి కత్తి తీసుకుని, గుహకేసి నడిచాడు. మిగతా సైనికులు అతణ్ణి అనుసరించారు. అందరూ గుహలోపల అడుగు పెట్టేసరికి, వాళ్ళకు చిన్న అరుపులాంటిది వినిపించింది.

సమరసేనుడు చప్పున ఒక అడుగు వెనక్కు వేసి, "గుహలో గాయపడిన మరొక సింహం వున్నట్టున్నది. అది ఏ స్థితిలోవున్నదో తెలుసుకోకుండా, లోపలికి వెళ్ళడం ప్రమాదకరం. నిప్పు వెలిగించండి," అన్నాడు సైనికులతో.

వెంటనే యిద్దరు సైనికులు చెకుముకి రాయికొట్టి, గుహద్వారం దగ్గిర మంట చేశారు. దానితో చిన్న కాగడా ముట్టించి సమరసేనుడు ముందుకు వెళ్ళి గుహ లోపలి భాగాన్ని పరీక్షగా చూశాడు. అక్కడ బాణం దెబ్బతిని గిలగిల తన్నుకుంటున్న ఒక సింహంపిల్లా, దాని పక్కనే అరుస్తూ, మరొక సింహంపిల్లా కనిపించినై.

"భయం లేదు, యిక లోపలికి రండి," అన్నాడు సమరసేనుడు.

సింహం పిల్లల్లో గాయపడకుండా వున్నది, మెల్లిగా అరుస్తూ గుహ వెనుక భాగానికి పోసాగింది. సమరసేనుడు చిన్నగా యీల వేసి, గుహలో ఒక పక్కగా కూర్చున్నాడు. సైనికులు కూడా గుహలోకి వచ్చారు.

అప్పటికి బాగా పొద్దుపోయింది. కుంభాండుడూ, ఆటవికులూ యింకా సమరసేనుడి కోసం అడవి గాలిస్తున్నా

రన్న సూచనగా, అప్పుడప్పుడూ వాళ్ళ కేకలు వినబడుతున్నవి. తాము దాగి వున్న చోటు తెలియకుండా వుండేందుకు సమరసేనుడు గుహముందు వెలిగించిన మంట ఆర్పివేయించాడు.




గుహలో చాలా చీకటిగా వున్నది. బాణం దెబ్బతిన్న సింహంపిల్ల చచ్చిపోయింది. గుహ వెనుకకు పోయి కూర్చున్న సింహం పిల్ల మాత్రం, అక్కడే వుండి కవ్విస్తున్నట్టు మధ్య,మధ్య మెల్లిగా గర్జిస్తున్నది. బయిటికి పారిపోయిన సింహం తన పిల్లల కోసం తిరిగి రావచ్చునన్న భయం సమరసేనుడికి కలిగింది. కుంభాండుడూ, ఆటవికులూ తమ కోసం అడవిలో యింకా వెతుకుతూ వుంటారన్న అనుమానం కూడా అతణ్ణి బాధించసాగింది.

ఈ కారణాల వల్ల సమరసేనుడితో పాటు సైనికులు కూడా ముంచుకు వస్తున్న నిద్రను ఆపుకుంటూ, చీకట్లో అలాగే కూర్చున్నారు. హఠాత్తుగా సమరసేనుడికి ఒక అనుమానం కలిగింది. ఒకవేళ కుంభాండుడు తాను దాగి వున్న గుహ ఎక్కడో తెలుసుకుని, తన ఆటవిక మూకతో గుహద్వారాన్ని అటకాయిస్తే, తమకు పోరాడేందుకూడా అవకాశం లేకుండా ప్రాణాలు విడవవలసి వస్తుంది! అందువల్ల సైనికులను దాపుల వున్న చెట్లమీద వేగులుగా వుంచడం మంచి దనుకున్నాడు.

''మనం అందరం యీ గుహలో కూర్చోవడం వల్ల, హఠాత్తుగా కుంభాండుడు మనమీద దాడి చేస్తే చిక్కుల్లో పడిపోతాం. కనక, మీరు ఆ చెట్లెక్కి, కుంభాండుడూ, ఆటవికులూ మన కోసం ఏ ప్రాంతాలు వెదుకుతున్నారో కనిపెట్టి చూడండి. ఒకవేళ, వాళ్ళు యీ ప్రాంతాల కేసి వస్తూండడం కంట బడితే, మనం యిక్కడి నుంచి మరొక చోటుకు తప్పుకుందాం,'' అన్నాడు సమరసేనుడు, సైనికులతో.

సైనికులు తమ నాయకుడి ఆజ్ఞ వింటూనే గుహనుంచి బయటికి వచ్చి, అక్కడికి దాపుల గుబురు కొమ్మలతో వున్న చెట్టెక్కి, అడవిలో కుంభాండుడు ఏ ప్రాంతాన వున్నదీ చూడసాగారు.

గుహలో ఒంటరిగా వున్న సమర సేనుడికి దగ్గర్లోనే మాటలు వినబడినై. అవి తన సైనికుల మాటలు కాదని గుర్తించాడు. ఒకవేళ కుంభాండుడి అను చరులేమో అన్న అనుమానం కలిగిం దతడికి. నిశ్శబ్దంగా గుహద్వారం దగ్గిరకు వచ్చి బయటికి తొంగిచూశాడు. ఎవరూ కనిపించలేదు. తృప్తిగా తలాడించి గుహ లోపలికి వెళ్ళగానే, యీ సారి మాటలు స్పష్టంగా వినపడసాగినై.

సమరసేనుడికి చాలా ఆశ్చర్యం కలి గింది. గుహలో ఎక్కడన్నా రహస్య ద్వారం వున్నదేమో అని పరికించి చూశాడు. ఆ మాటల ధ్వని గుహ వెనక వైపు నుంచి వస్తున్నట్టు తెలుసుకుని నిర్విణ్ణుడయిపోయాడు. పెద్ద కొండలో వున్న యీ చిన్న గుహ వెనకకు మానవ మాత్రులు ఎలా వెళ్ళగలిగారా, అన్న సంశయం అతడికి కలిగింది. రహస్య ద్వారం ఏమైనా వున్నదేమో అని, యీసారి గుహ వెనుకభాగాన్ని పరీక్షించి చూడ సాగాడు.

హఠాత్తుగా అతడి చేతికి చిన్న మేకు లాంటిది తగిలింది. దాన్ని పట్టుకుని బలంగా గుంజేసరికి, రాతిలో మలచబడిన ఒక చిత్రమైన తలుపు తెరుచుకున్నది. అందులో నుంచి చంద్రకాంతి గుహలో ప్రవేశించింది. అక్కడికి కొద్ది గజాల దూరంలో, యిద్దరు మనుషులు మాట్లాడు కుంటున్నట్టు సమరసేనుడు చూశాడు. వాళ్ళ దుస్తుల తీరును బట్టి, వాళ్ళు ఆట వికులుగా లేరు.

సమరసేనుడు ఏమి చేయటమా అని ఆలోచిస్తున్నంతలో, వాళ్ళ దృష్టి అతడి పైన బడింది. వాళ్ళు మెరుపు వేగంతో సమరసేనుడి పైకి దూకి, పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. —(ఇంకా వుంది)





# ధర్మమార్గం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏమి సాధించాలని యింతగా శ్రమపడుతున్నావో, నాకు తెలియదు. కాని, ఒక సంగతి గుర్తుంచుకో. ఉత్తమకార్యసాధనకు, ఉత్తమమైన మార్గాలే అనుసరించాలి. అంతే గాని, అక్రమ మార్గాల ద్వారా, ఉత్తమ కార్యాన్ని సాధించ చూడడం ధర్మవిరుద్ధమవుతుంది. ఇందుకు ఉదాహరణగా ధర్మనందనయోగి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

పూర్వం శిళ్ళంగేరి అనే గ్రామంలో ధర్మనందను డనే ఒక గొప్ప యోగి

## బేతాళ కథలు

వుండేవాడు. ఆయనకు ఒక విద్యాకేంద్రాన్ని నెలకొల్పాలనే ఆలోచన కలిగింది. కొంతకాలం పాటు చాలా ఊళ్ళు తిరిగి, ప్రజల నుంచి విరాళాలు వసూలుచేసి, ఒక విద్యాకేంద్రాన్ని స్థాపించాడు.

ఆ కేంద్రంలో వేద, శాస్త్రాలతో పాటు విద్యార్థులకు సత్ప్రవర్తనా,నైతిక విలువల పట్ల ఆదరం కలిగే విధంగా, పండితులు బోధచేస్తూండే వాళ్ళు.

ఈ కారణంగా ధర్మనందనుడు స్థాపించిన విద్యాకేంద్రం త్వరలోనే దేశంలో ప్రసిద్ధి కెక్కింది. ప్రతిసారీ ప్రజల నుంచి విరాళాలు వసూలు చేయటం కాక, ఆ దేశాన్నేలే రాజు నుంచి అవసరం అయిన ధనసహాయం పొందడం బావుంటుందని ధర్మనందనుడు ఒకనాడు రాజును చూడబోయాడు.

రాజు, ఆయన చెప్పినదంతా విని, "ఇంత కాలంగా నా ప్రమేయం లేకుండానే విద్యాకేంద్రాన్ని నడుపుతున్నారు గదా ? ఇప్పుడు నా నుంచి ధనసహాయం కోరవలసిన అవసరం ఎందుకు కలిగింది ? మీరు విద్యార్థులకు ఉత్తమవిద్య నేర్పుతున్న మాట నిజమైతే, ప్రజలే మీకు చాలినంత ధనసహాయం చెయ్యగలరు," అన్నాడు.

తను స్థాపించిన విద్యాకేంద్రాన్ని మరింతగా అభివృద్ధి చేయటమే ధర్మనందనుడు తన జీవితధ్యేయంగా పెట్టుకున్నాడు. ఆయన తిరిగి ఎంత శ్రమించి



ఊళ్ళ వెంట చందాల కోసం సంచారం చేసినా, మునుపటిలాగా విరాళాలు వసూలు కాలేదు. ఈ పరిస్థితుల్లో ఆయన నిస్పృహ చెంది, విద్యాలయాన్ని మూసి వేయడానికి నిశ్చయించుకున్నాడు.

ఆ దశలో ధర్మనందనుడి దగ్గరకు భీమయ్య అనే ఒక వ్యక్తి వచ్చి, విద్యా కేంద్రాన్ని మూసివేయ వద్దనీ, తాను తగిన ఆర్థికసహాయం చెయ్యగలననీ వాగ్దానం చేశాడు. ధర్మనందనుడు చాలా సంతోషించి, భీమయ్యను గురించి వివరాలు అడిగాడు.

"అయ్యా, నా వృత్తి, వ్యక్తిగత విషయాల గురించి మీరు తెలుసుకున్నందువల్ల, కొత్తగా కలిగే మేలేం వుండదు. అన్నప్రకారం తమకు ప్రతినెలా కొంత డబ్బు పంపుతుంటాను," అన్నాడు భీమయ్య.

ఆ తరవాత ధర్మనందనుడికి, భీమయ్య నుంచి నెలనెలా కొంత డబ్బు వస్తూం డేది. విచారించగా భీమయ్య ఆ ప్రాంతాల ఎంతో కాలంగా గొప్ప ధర్మదాత అన్న పేరు ప్రతిష్ఠలు గలవాడని, ధర్మనందనుడికి తెలిసింది.

కొంతకాలం గడిచింది. ఒక రోజున ధర్మనందనుడు, భీమయ్యను గురించిన ఆశ్చర్యకరమైన విషయం ఒకటి విన్నాడు. తనకు ధనసహాయం చేస్తున్న భీమయ్య ఒక దోపిడీదొంగల ముఠాకు నాయకుడు! తన దానధర్మకార్యాల వెనక, అతడు



చేస్తున్నవి, దారిదోపిడులు. రాజు, అతణ్ణి పట్టియిచ్చిన వారికి పెద్ద బహుమానం కూడా ప్రకటించాడు.

ధర్మనందనుడు వారం తిరక్కుండానే భీమయ్య ఆచూకీ రాజుకు తెలియ బరిచాడు. రాజభటులు భీమయ్యను సునాయాసంగా పట్టుకుని కారాగారంలో వేశారు.

రాజు, ధర్మనందనుడు చేసిన సహాయానికి ఎంతగానో సంతోషించి, విద్యాకేంద్రం ఎలాంటి ఆర్థికయిబ్బందులకూ లోను కాకుండా, అవసరం అయిన ఆర్థిక వనరులు సమకూర్చాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, ధర్మనందనుడి ప్రవర్తన సమర్థనీయమైనదేనా ? తన జీవితధ్యేయంగా నడుపుతున్న విద్యాకేంద్రం, ఆర్థికయిబ్బందుల కారణంగా మూతపడనున్న దశలో ధనసహాయం చేసిన వ్యక్తికి ద్రోహం చేయడం కాదా ? గజదొంగ తాను దోచిన ధనాన్ని, ఒక మంచి కార్యానికి ఉపయోగించడంలో తప్పేమున్నది ? అంతే కాక, ఏ రాజు తనకు ధనసహాయం చేయ నిరాకరించాడో, ఆ రాజుకు తనకు మేలు చేసిన వాణ్ణి పట్టియివ్వటం న్యాయం అనిపించుకుంటుందా ? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధర్మనందనుడి విద్యాకేంద్రం, విద్యార్థులకు వేద, శాస్త్ర, పురాణాలు బోధించడంతో పాటు, వాళ్ళల్లో సన్మార్గవర్తనా, నీతినియమాలు పెంపొందించడం కూడా ధ్యేయంగా పెట్టుకున్నది. అందువల్ల ధర్మనందనుడు ఆ ధ్యేయాన్ని సాధించడంలో, అందుకు విరుద్ధమైన సాధనాన్ని అంగీకరించడం అర్థంలేని పని అవుతుంది. ఆ కారణంగా అతడి ప్రవర్తన ఏ విధంగానూ ధర్మ విరుద్ధం అనిపించుకోదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






పాతికేళ్ళ వయసువాడైన శేషాచలానికి బాధ్యతలూ లేవు, పనీ లేదు. వాడు ఏ గుడి అరుగు మీదో కూర్చుని వాళ్ళూ, వీళ్ళూ వేసిన చిల్లర డబ్బులతో, పొట్ట గడుపుకుంటూ వుంటాడు. వాడికి కష్టపడి పని చేయడానికి ఒళ్లు వంగదు, అయినా బోలెడు డబ్బు సంపాయించాలనే ఆశ.

ఒక రోజు రాత్రి వాడు ఊరికి పెడగా, చెరువుగట్టు మీది చెట్టు కింద పడుకుని నిద్రపోతున్నాడు. ఏదో పెద్ద అలికిడి అయి వాడికి మెలుకువ వచ్చింది.

చెరువుగట్టు మీద రెండు పిశాచాలు గట్టిగా పోట్లాడుకుంటున్నాయి. ఒక పిశాచి తెల్లగా వున్నది, మరొకటి నల్లగా వున్నది. శేషాచలానికి పిశాచాల భయం లేదు. వాడు లేచి కూర్చుని, ''అర్ధరాత్రి ఏమిటి గొడవ? ఏ వల్ల కాటికో పోయి చావండి!'' అని కోపంగా కేక పెట్టాడు.

పిశాచాలు రెండూ పోట్లాట మాని, ''నువ్వే, మా తగువు తీర్చాలి, గురూ!'' అంటూ వచ్చి శేషాచలం కాళ్ళ దగ్గిర కూలబడ్డాయి.

''మరే, పాపం! నాకు పనేమీ లేదనుకున్నారా, వెళ్ళిరండి!'' అంటూ చిరాకు పడ్డాడు శేషాచలం.

''బాబ్బాబు, అలా అనకు. నువు చెప్పిందే సరైన తీర్పుగా ఒప్పుకుంటాం. మాలో ఎవరు అందంగా వుంటారు?'' అని, పిశాచాలు బ్రతిమలాడాయి.

శేషాచలం ఏదో చెప్పబోతూండగా, ''నేను తెల్లగా మెరిసిపోతూ వుంటాను. ఇది, బొగ్గుముక్కలా వుంటుంది కదూ?'' అన్నది తెల్లపిశాచి.

''నేను నల్లగా నిగనిగలాడుతూ వుంటాను. అది పిండిబొమ్మలా వుంటుంది కదూ?'' అన్నది నల్లపిశాచి.

మాచిరాజు కామేశ్వరరావు



ఆ డబ్బు లెక్క చూసుకుని పరమానందం చెందాడు, శేషాచలం. వాడు శుభ్రమైన బట్టలు కుట్టించుకున్నాడు. అద్దె ఇల్లు తీసుకున్నాడు. పూటకూళ్ళ బసలో నెల వాడుక కుదుర్చుకున్నాడు.

వాడు మళ్ళీ వచ్చిన అమావాస్య అర్ధ రాత్రి చెరువుగట్టు మీదికి వెళ్ళగానే, పిశాచాలు వచ్చి, "నీ అభిప్రాయం ఏమిటో వేగిరం చెప్పు!" అన్నాయి తొందరపెడుతూ.

"అంత తొందర పనికిరాదు. నేను, మిమ్మల్ని చూడటం యిది రెండోసారి. పెద్దలన్నట్టు, ముచ్చటగా మూడుసార్లు చూడనీయండి," అన్నాడు శేషాచలం.

పిశాచాలు నిరుత్సాహపడిపోతూ, "అయితే, మళ్లీ అమావాస్యకు వస్తాం," అన్నవి.

"ఆసరికి నేనీ ఊరే వదలవలసి రావొచ్చు. అద్దె ఇళ్ళ అగచాట్లు మీరెరగరు. ఇంటి యజమాని ఇల్లు ఖాళీ చేయమంటున్నాడు. సొంత ఇల్లంటూ వుంటేగాని, బతకలేను," అన్నాడు శేషాచలం.

పిశాచాలు తమలో తాము కాస్సేపు మాట్లాడుకుని, ఆ క్షణంలోనే, చెరువుకు అల్లంత దూరంలో వున్న చిట్టడివి పక్కన, ఇల్లు సృష్టించి యిచ్చాయి.

"నేను, మిమ్మల్ని యిదే చూడటం. అప్పుడే అభిప్రాయం ఎలా చెబుతాను? మళ్ళీ రండి," అన్నాడు శేషాచలం.

"మేం మళ్ళీ అమావాస్యకు, యీ చెట్టు దగ్గిరకు వస్తాం. ఈలోపల బాగా ఆలోచించి చూడు," అని పిశాచాలు వెళ్ళబోయాయి.

"ఆగండి. ఆ సరికి నేనూ, మీ జాతిలో కలిసిపోతాను! ఏ ఉద్యోగం లేని నేను అంతవరకూ ఎలా బతకడం?" అన్నాడు శేషాచలం తెలివిగా.

పిశాచాలు తమలో తాము ఏదో మాట్లాడుకుని, చెరొక సంచీడు డబ్బు శేషాచలం చేతిలో పెట్టి, మాయమయాయి.

శేషాచలం అసంతృప్తిగా ముఖం పెట్టి, "ఇల్లు యిచ్చారు, బాగానే వున్నది. మరి ఇల్లు గడవడానికి డబ్బు కావద్దా? అవతల అన్నిటికీ ధరలు మండిపోతు న్నాయి!" అని పిశాచాల దగ్గిర మరి కొంత డబ్బు వసూలు చేశాడు.

వాడు అప్పటికప్పుడే, ఆ కొత్త ఇంట్లో చేరాడు. ఆ ఇంటికీ, పూటకూళ్ళ బసకూ చాలా దూరం. పెళ్ళాం అంటూ వుంటే, హాయిగా వండి పడిస్తుందనుకున్నాడు వాడు.

ఆ మర్నాటి నుంచీ పెళ్ళికూతుళ్ళ వేటలో పడ్డాడు, శేషాచలం. వాడికి అలివేలు అనే అమ్మాయి బాగా నచ్చింది. ఆమెను, వాడు లోగడ గుడి దగ్గిర చూశాడు.

"ఇటువంటి సోమరిపోతులకు భిక్ష వేయకూడదు!" అంటూ ఆమె, శేషాచలాన్ని చీదరించుకుని, పక్కనే వున్న గుడ్డి ముసలిదానికి చిల్లరడబ్బులు వేసి వెళ్ళిపోయింది.

ఇప్పుడు శేషాచలం వేషం మారి పోవడంతో, అలివేలు వాణ్ణి గుర్తించ లేదు. ఆమె తండ్రి, శేషాచలం ఇంటినీ, అతడి దగ్గిర వున్న డబ్బునూ చూసి, సంతోషపడిపోయి ఆమెను, శేషాచలాని కిచ్చి పెళ్ళి చేశాడు.



విందులూ, వినోదాలతో శేషాచలానికి మళ్ళీ అమావాస్య వచ్చిందన్న గుర్తే లేదు. అర్ధరాత్రి వేళ తలుపు చప్పుడైతే, విసుగ్గా వెళ్ళి తలుపు తీసిన వాడికి, ఎదురుగా పిశాచాలు కనబడేసరికి, ఉలిక్కిపడ్డాడు.

భార్య వాటిని చూసి ఎక్కడ దడుచు కుంటుందో అని, "మీకు బుద్ధంటూ లేదు. ఏకంగా ఇంటికే వచ్చేయడమా? పదండి, పదండి," అంటూ శేషాచలం, పిశాచాలను ఇంటికి దూరంగా తీసుకు పోయాడు.

"ఆలోచించావా? నేను తెల్లగా బావుంటాను కదూ!' అన్నది తెల్లపిశాచి.

"నేను నల్లగా వున్నా, కళగా వుంటాను కదూ!" అన్నది నల్లపిశాచి.

శేషాచలం గట్టిగా గొంతు సవరించుకుని, "మీ మొహాలు! నలుపూ, తెలుపుల్లో ఏమీ లేదు; అంతా డబ్బులోనే వుంది. అది వుంటే, ఉన్న లోపాలు కూడా కప్పపడిపోతాయి. అది లేనివాడిలో, లేని లోపాలు కూడా కనిపిస్తాయి. నా దగ్గిర డబ్బు లేనప్పుడు నన్ను చీదరించుకున్న మనిషి, డబ్బు చేరగానే నన్ను సంతోషంగా పెళ్ళి చేసుకున్నది. కనక, అందచందాలూ, మంచీ, మర్యాదల్లాంటివన్నీ, డబ్బున్న చోటనే వుంటాయి. అదిసరే! కొత్తగా పెళ్ళి చేసుకున్నాను. బోలెడు ఖర్చులున్నాయి. డబ్బు కావాలి!" అన్నాడు.

శేషాచలం చెప్పినదంతా విన్న పిశాచాలు తెల్లమొహం వేసి, "నిజమే సుమా! మా కళ్ళు తెరిపించావు. మా దగ్గిర వున్న డబ్బులో చాలా భాగం నీకే యిచ్చేశాము. మా డబ్బు, మేం పట్టుకుపోతాం!" అంటూ మాయమయిపోయాయి.

ఆ మరుక్షణం, అక్కడ ఇల్లూ లేదు, ఇంట్లో డబ్బూ లేదు.

"ఏమయిందండీ? ఏమిటీ విచిత్రం!" అంటూ అలివేలు ఆశ్చర్యంగా శేషాచలాన్ని అడిగింది.

ఇన్నాళ్ళూ ఎలా బతికినా, ఇప్పుడు భార్యను పోషించడానికయినా కష్టపడి పని చేయాలని నిశ్చయించుకున్న శేషాచలం, భార్యకు జరిగినదంతా చెప్పి, "నన్ను క్షమించు!" అంటూ తల వంచుకున్నాడు.

"కష్టపడకుండా సంపాయించిన డబ్బు, పేలపిండిలా ఎగిరిపోతుంది. ఆ రోజు గుడి దగ్గిర నేను అసహ్యించుకున్నది నిన్ను కాదు; నీలోని సోమరిపోతును! ఇప్పటికయినా నువ్వు, నీకాళ్ల మీద నిలబడితే, మునుపటికన్న రెట్టింపుగా నిన్ను గౌరవిస్తాను," అన్నది అలివేలు.



# స్థితప్రజ్ఞుడు

ఒక మహర్షి మరణశయ్య మీద ఉన్నాడు. ఆయన చివరి సందేశం కోసం శిష్యులంతా చుట్టూ మూగి, నిశ్శబ్దంగా నిలుచున్నారు.

మహర్షికి ఎగశ్వాస కలుగుతున్నది.

"ఎలా ఉంది, స్వామీ?" అని ఒక శిష్యుడు మహర్షిని అడిగాడు.

"చాలా భారంగా ఉంది, నాయనా!" అన్నాడు మహర్షి.

శిష్యులంతా ఆశ్చర్యపోయారు. ఆయన కష్టాలనూ, సుఖాలనూ సమంగా స్వీకరించడం వాళ్ళు ఎన్నోసార్లు చూసి వున్నారు.

"ఎందుకు, స్వామీ?" అని మరో శిష్యుడు అడిగాడు.

"పిచ్చివాడా, నలుగురు మోయవలసిన ఈ శరీరాన్ని ఇంకా నేను ఒక్కణ్ణే మోస్తున్నాను! భారం కాదా?" అని మహర్షి నవ్వుతూ కన్నుమూశాడు.

—టి. వి. యస్. అరుణ్‌మూర్తి.





# పరిష్కారం

ధర్మరాజుకు చిన్నతనంలో నే తల్లి దండ్రులు పోతే, అతని మేనమామ వెంకయ్య పెంచి పెద్దచేసి, చదువు సంధ్యలు చెప్పించాడు. తరవాత తన పలుకుబడి ఉపయోగించి రాజధానిలో మంచి ఉద్యోగం యిప్పించటమే గాక, ఒక చక్కని పిల్లను వెతికి తెచ్చి, ధర్మ రాజుకు వివాహం చేసి, తన బాధ్యత నెర వేర్చుకున్నాడు.

ధర్మరాజు కాపరం కొన్నాళ్ళు బాగానే సాగింది. తర్వాత భార్యాభర్తల మధ్య కీచులాటలు ప్రారంభమయాయి. తన చేతుల మీదగా జరిగిన పెళ్ళి, యిలా పరిణమించినందుకు వెంకయ్య బాధ పడ్డాడు. అసలు ఇలాంటి పరిస్థితి ఎందుకు వచ్చిందో స్వయంగా తెలుసు కునేందుకు, వెంకయ్య మేనల్లుణ్ణి చూడ బోయాడు.

ఆయన వెళ్ళేసరికి ఇంట్లో ఏవో కొత్త, కొత్త ముఖాలు కనిపించాయి. ధర్మరాజూ, అతడి భార్య విశాలాక్షి ఆయన్నెంతో సాద రంగా ఆహ్వానించారు.

వెంకయ్య మేనల్లుణ్ణి పక్కకు పిలిచి, "ఇంట్లో చేరిన వాళ్ళంతా, ఎవర్రా?" అని అడిగాడు.

"మన బంధువులే, మామయ్యా! వరసకు ఏదేదో అవుతారట. రాజధాని కదా, ఏవేవో పనులుంటాయి. పనులు చక్కబెట్టుకుని వెళుతూంటారు," అన్నాడు ధర్మరాజు.

అప్పటికి తల పంకించి వూరుకున్నాడు వెంకయ్య. ఇంట చేరిన జనం ఒక్కొ క్కళ్ళే వెంకయ్యను సమీపించి, తమ బంధుత్వం గురించి, అటు ఏడు తరాలూ, యిటు ఏడు తరాలూ ఏకరువు పెట్ట సాగారు. ఇలా బంధుత్వం ముసుగుతో,

బొమ్మిడి అచ్చారావు

గాదెకింద పందికొక్కుల్లా మేనల్లుడి ఇంట చేరి, ఇల్లు గుల్లచేస్తున్నారన్న మాట అనుకున్నాడు వెంకయ్య.

ధర్మరాజు పనికి వెళ్ళిన సమయంలో వెంకయ్య విశాలాక్షిని పిలిచి, "ఏమిటమ్మా యింటి సంగతులు ?" అని అడిగాడు.

విశాలక్షి విచారంగా ముఖం పెట్టి, "ఏం చెప్పమన్నారు, బాబాయిగారూ ! నిత్యం ఇంట్లో ఎవరో ఒకరుచుట్టపక్కాలు. వీళ్ళకు వండి వార్చలేక, నా నడుము పడిపోతున్నది. నెలరోజుల పాటు యింటి అవసరానికని కొన్న సరుకులు, పట్టుమని పదిరోజులు చాలటం లేదు. మళ్ళీ తెమ్మంటే, మీ అల్లుడుగారు కస్సుమని లేస్తారు," అన్నది.

భార్యాభర్తల మధ్య కీచులాటలకు ముఖ్యకారణం బోధపడింది, వెంకయ్యకు.

ధర్మరాజు ఒంటరిగా వున్న సమయం చూసి, అతడి కొత్త కాపరం గురించి ఆరాలు తీయసాగాడు.

ధర్మరాజు ఉద్రేకపడిపోతూ, "మామయ్యా, నువ్వు నా మెడకు గుదిబండ తగిలించి, నాకు ఊపిరాడకుండా చేశావు. విశాల నువ్వనుకున్నంత తెలివితేటలూ, కలుపుగోలు తనం వున్న మనిషి కాదు. ఒట్టి జగడాలమారి," అన్నాడు.

"అలాగా ! ఇంతకీ ఏం జరిగింది ?" అని అడిగాడు వెంకయ్య.

"ప్రతి స్వల్పానికీ రాద్ధాంతం చేస్తుంది. ఇంటి ఖర్చులకు నెలకు సరిపడా సామా



సులు తెచ్చిపడేస్తానా, వాటిని వారంరోజుల్లో అలావులూ, పలావులూ చేసి, మళ్ళీ తెమ్మంటుంది. ఇదేమిటంటే, ఒంటికాలి మీద లేస్తుంది. నేను మటుకు లక్షాధికారినా, మామయ్యా! నా కొచ్చే జీతం డబ్బుల్తో, అన్నీ సరిపెట్టుకోవద్దా,'' అన్నాడు ధర్మరాజు కోపాన్ని దిగమింగుకుంటూ.

వెంకయ్య జవాబుగా ఏమీ అనక, తల వూపి వూరుకున్నాడు. అదే పనిగా బంధువులు; బంధువుల బంధువులూ పడితినే యిల్లు గుల్లకాక తప్పదు. నిజానికి ధర్మరాజు చేసే ఉద్యోగం చచ్చుదేమీ కాదు. అతనికొచ్చే జీతంతో భార్యా, భర్తలు నెల పొడవునా హాయిగా తినటమేగాక, యింత వెనకేయవచ్చును కూడా.

భార్యా, భర్తల మధ్య పరిస్థితి యింతగా దిగజారిపోవటం, వెంకయ్యకు బాధ కలిగించింది. ఇంట్లో నానారకాల బంధుగణం చేరటం మూలాన, ధర్మరాజూ, విశాలాక్షి మనసుపడి మాట్లాడుకునే అవకాశమే లేదు. ఒకరి కష్టాలొకరు మనసు విప్పి చెప్పుకోకపోవటంవల్ల, మానసికంగా ఒకరికొకరు దూరంకావటం, ఇద్దరి మధ్యా అగాధాలు ఏర్పడటానికి కారణం అవుతున్నది.

వెంకయ్య నగరంలో మరి రెండు రోజులుండి తానెరిగిన వారిని కలుసుకుని ధర్మరాజుకు రాజధానికి చాలా దూరాన వున్న ఒక ప్రదేశానికి బదిలీకి ఏర్పాట్లు చేశాడు.

ధర్మరాజు మొదట్లో ఆ కొత్త ప్రదేశాన, తనకు రాజధానిలో గల సౌకర్యాలన్నీ లేవని బాధపడ్డాడు. కాని, యీ మారుమూల బంధువుల దాడులు లేకపోవటంతో, అతడికీ, భార్యకూ మధ్య లోగడ ఏనాడూ లేనంత సాన్నిహిత్యం ఏర్పడింది.

తన మేనల్లుడూ భార్యా చాలా అన్యోన్యంగా వుంటున్నారనీ, భార్య కోర్కెలను, తన మేనల్లుడు చిటికెలో తీర్చగలుగుతున్నాడనీ తెలిసి, వెంకయ్య తృప్తిగా నవ్వుకున్నాడు.





# వరహాల మూట

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్వుడు ఒక భూస్వామికి కుమారుడుగా జన్మించాడు. అతడు పెరిగి, పెద్దవాడవుతున్న కాలంలో, ఆ కుటుంబం మరింత సంపన్నమయింది. అతడికి ఒక తమ్ముడు కూడా వున్నాడు.

కొంత కాలానికి భూస్వామి కాలధర్మం చెందాడు. కుటుంబానికి సంబంధించిన ఒక గ్రామంలో తమకు రావలసిన వసూళ్ల కోసం అన్నదమ్ము లిద్దరూ బయలుదేరి వెళ్ళారు. అక్కడ రైతుల నుంచి తమకు రావలసిన ధాన్యం వగైరా వసూళ్ల ద్వారా వెయ్యివరహాల నగదు లభ్యమయింది.

ఆ డబ్బు తీసుకుని అన్నదమ్ము లిద్దరూ కాశీనగరానికి బయలుదేరారు. దారిలో వారొక నది దాటవలసి వున్నది. పడవవాడు రావడానికి యింకా వ్యవధి వుండడం చేత, వాళ్ళు వెంట తెచ్చుకున్న ఫలహారం మూట విప్పి తిని, ఇన్ని మంచినీళ్ళు తాగారు.

బోధిసత్వుడు అలవాటు చొప్పున తన భాగంలో కొంత ఫలహారం మిగిల్చి, దానిని నదిలోకి విసిరాడు.

బోధిసత్వుడు విసిరిన ఫలహారాన్ని నదిలో వుండే జలభూతం అందుకున్నది. ఆ ఫలహారాన్ని తినగానే దానికొక దివ్యమైన శక్తి కలిగింది. దాని ద్వారా, ఆ జలభూతం తనకు ఫలహారం వేసిన వారెవరైందీ గ్రహించింది.

బోధిసత్వుడు ఆకలి తీరడంతో నది ఒడ్డున ఇసుక మీద పైబట్ట పరుచుకుని పడుకున్నాడు. అతడి తమ్ముడిది దొంగ బుద్ధి. అన్నకు భాగం లేకుండా వెయ్యి వరహాల సొమ్ము తనదిగా చేసుకోవాలని అతడికి బుద్ధిపుట్టింది. ఆ వెంటనే అతడు

వరహాలున్న మూటవంటిదే, రాళ్ళతో మరొక మూట తయారు చేశాడు. ఆ రెండు మూటలూ అన్నకు కనబడకుండా తన దుస్తుల్లో దాచాడు.

తరవాత కొంతసేపటికి పడవవాడు రాగానే బోధిసత్వుడు నిద్రలేచాడు. అన్నదమ్ము లిద్దరూ పడవ ఎక్కారు. పడవ నదీ మధ్యకు వచ్చింది. తను చేసిన యుక్తిప్రకారం తమ్ముడు రాళ్ళమూటను నదిలో జారవిడవదలిచాడు. చేసేది దొంగపని గనక, చేతులు వణుకుతూండగా అతడు మూటల్లో ఒకదాన్ని నదిలోకి జారవిడిచి, "అయ్యో, అన్నయ్యా! వరహాల మూట కాస్తా నదిలో పడిపోయింది," అంటూ అరిచాడు.

ఈ మాటకు అన్న, "పోనీలే తమ్ముడూ, అది మన సొమ్ము కాదు, అందువల్లనే నదిలో పడిపోయింది. దానికోసం విచారించడం తెలివిమాలిన పని అవుతుంది," అని వూరుకున్నాడు.

బోధిసత్వుడు విసిరిన ఫలహారం తిన్న జలభూతం, ఆ నదిలో పడింది వరహాల మూట అని తెలుసుకోవడమే గాక, తమ్ముడి దుర్మార్గం కూడా గ్రహించింది. అది వెంటనే ఒక పెద్ద చేపను ప్రోత్సహించి, ఆ వరహాలమూటను మింగేలా చేసింది.

ఆ తరవాత, ఆ చేప తనకన్ను గప్పి, ఎక్కడికీ పోకుండా జలభూతం దివారాత్రాలు కాపలా కాయసాగింది.



బోధిసత్వుడూ, అతడి తమ్ముడూ కాశీ నగరానికి తిరిగి వచ్చారు. ఇంటికి చేరుతూనే తమ్ముడు తనవద్ద వున్న రెండవ మూటను విప్పి చూశాడు. అందులో రాళ్ళు కనిపించాయి. తను చేసిన పొరబాటు తెలుసుకుని అతడు విచారంతో కుంగిపోతూ, మంచం పట్టాడు.

ఒక రోజున జాలరివాళ్ళు నదిలో వలలు వేశారు. జలభూతం తన శక్తివల్ల, లోగడ వరహాలమూటను మింగిన చేప వాళ్ళ వలల్లో పడేలా చేసింది. జాలరివాళ్ళు ఆ చేపను నగరానికి తీసుకుపోయి, దీని ఖరీదెంత? అని అడిగినవాళ్ళతో, "వెయ్యివరహాలూ, అదనంగా ఒక్క వరహా!" అనసాగారు.

జాలరివాళ్ళకు మతులు పోయినవని అందరూ నవ్వుకోసాగారు. వాళ్ళు ఆ చేపను బోధిసత్వుడి ఇంటికి తీసుకుపోయి, దాన్ని అమ్మజూపారు.

"ఈ చేప ఖరీదెంత?" అని అడిగాడు బోధిసత్వుడు.

"మీకైతే ఒక్క వరహా మాత్రమే!" అన్నారు జాలరివాళ్ళు.

"ఇతరులకైతే ఎంత వెల చెబుతున్నారు? మీ మాటల ధోరణి చూస్తూంటే, నాకు ఆశ్చర్యం కలుగుతున్నది," అన్నాడు బోధిసత్వుడు.

"మరెవరికైనా అయితే వెయ్యివరహాలు, పైన మరొకవరహా తీసుకుంటాం." అన్నారు జాలరివాళ్ళు.



బోధిసత్త్వుడు వాళ్ళ జవాబుకు ఆశ్చర్యపోతూ, వరహాయిచ్చి ఆ చేపను కొన్నాడు.

తరవాత అతడూ, భార్యా ఆ చేపను కోయగా, దాని పొట్టలో నుంచి వెయ్యి వరహాలున్న మూట బయటపడింది. బోధిసత్త్వుడు దాన్ని గుర్తించాడు.

"ఈ వరహాల మూట మనదే!" అని బోధిసత్త్వుడు భార్యకు జరిగినదంతా చెప్పి, "ఈ జాలరివాళ్ళు దివ్యజ్ఞానం కలవాళ్ళలా కనబడుతున్నారు. చేప పొట్టలో వున్న యీ వెయ్యి వరహాల మూటా నా దేనని వాళ్ళు గ్రహించారు. అందుకే యితరులకైతే చేప ఖరీదు వెయ్యిన్నొక్క వరహా, నాకైతే వరహా అని చెప్పారు. వాళ్ళు అధికంగా కోరే ఒక్క వరహా, వాళ్ళు చేపను పట్టేందుకు పడిన శ్రమకు కూలీ అన్నమాట," అన్నాడు బోధిసత్త్వుడు.

తరవాత బోధిసత్త్వుడు, జాలరివాళ్ళకు అంతటి దివ్యజ్ఞానం ఎలా కలిగిందా అని ఆలోచిస్తూండగా, ఒక దివ్యవాణి యిలా పలికింది:

"మహానుభావా, నేను నదిలో నివసించే జలభూతాన్ని. ఒకనాడు నువ్వు నదిలోకి విసిరిన ఫలహారాన్ని తిని, దివ్యశక్తిని పొందగలిగాను. నీటిలో పడిన వరహాల మూటను చేప చేత మింగింపచేసినది, నేనే. జాలరివాళ్ళను ప్రోత్సహించి నీ వద్దకు పంపినది కూడా, నేనే. ఈ విధంగా నీ రుణం తీర్చుకోగలిగాను. ధనాశాపరుడూ, దుర్మార్గుడూ అయిన నీ తమ్ముడికి మాత్రం, ఆ ధనంలో భాగం యివ్వకు."

జలభూతం చేసిన ఉపకారానికీ, దాని మంచితనానికీ బోధిసత్త్వుడు చాలా సంతోషించాడు. ఐతే, అతడు తన తమ్ముడి విషయంలో మాత్రం దాని సలహా పాటించలేదు. సోదరన్యాయాన్ని అనుసరించి, బోధిసత్త్వుడు తన తమ్ముడికి ఐదు వందల వరహాలు యిచ్చి, తన సోదరప్రేమను వ్యక్తపరిచాడు.





# కనిష్కుడు

రెండువేల సంవత్సరాలకు పూర్వం, భారతదేశపు పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతాల మీద, సంచారజాతులు అనేకసార్లు దాడి చేసినై. ఈ జాతులు ఎక్కడా స్థిరనివాసం ఏర్పరుచుకోక పోవడంతో, ఆ ప్రాంతాలను పాలించే ఏ రాజులకూ, వాళ్ళను నిరోధించడం సాధ్యం కాలేదు.

కాలక్రమాన యీ సంచార జాతుల వాళ్ళు నివాసాలు ఏర్పరచుకుని, వ్యవసాయం, వర్తకం లాంటి కార్యకలాపాలు సాగించారు.






కొన్నాళ్ళకు వాళ్ళ నాయకులలో కొందరు బలవంతులయారు. వాళ్ళల్లో కడ్ఫైసీజు అనేవాడు పురుషపూర్ అనే నగరాన్ని – ఇప్పటి పెషావర్ను – నిర్మించడమే కాక, ఒక రాజవంశాని క్కూడా మూలపురుషుడయాడు. ఆ వంశంలో మూడవవాడైన కనిష్కుడు పురుషపూర్‌ను శత్రుదుర్భేద్యమైన నగరంగా చేసి, అనేక రాజ్యాలను జయించాడు.



అతడు క్రీ. శ. 78 వ సంవత్సరంలో ఒక నూతన పంచాంగాన్ని తయారు చేయించాడు. దానినే మనం శక సంవత్సరం అని పిలుస్తున్నాం. ఒక సామ్రాజ్యాన్ని స్థాపించాలనే పట్టుదలతో కనిష్కుడు పెద్ద సైన్యంతో చైనీస్‌టర్కిస్థాన్, యార్‌ఖండ్, కాష్గర్ నగరాలపై దాడి చేయడమేగాక, ఇరుగు పొరుగు రాజుల నెందరినో జయించి, సామంతులుగా చేసుకున్నాడు.

ఆ తరవాత కొద్ది కాలానికే కనిష్కుడు సాధుస్వభావుడైన పరిపాలకుడుగా మారాడు. ఆయన ఒక గొప్ప బౌద్ధ పండిత పరిషత్తును కాశ్మీరులోని కుండల వనవిహారం అన్న చోట సమావేశపరిచాడు. ఆ సమావేశ నిర్ణయాలను రాగి రేకులపై చెక్కించి, రాబోవు తరాలవారి కోసం భద్రపరచడం జరిగింది.





కనిష్కుడి ఆస్థానంలో గొప్ప పండితులూ, కవులూ వుండేవారు. కవి అశ్వఘోషుడూ. తత్వవేత్త నాగార్జునుడూ, వైద్యాచార్యుడైన చరకుడూ, ఆయన ఆస్థానంలోని వారే. ఆయన పరిపాలనా కాలంలో లలితకళలు ఎంతగానో అభివృద్ధి చెందినవి. ముఖ్యంగా గాంధార శిల్పకళ పరిపక్వత చెందింది.

మహాకవి అయిన అశ్వఘోషుడు ఏకాంతంగా మానసికోద్వేగాన్ని కలిగించే తన కవిత్వాన్ని పఠిస్తూండగా, అశ్వాలు కంటనీరు కార్చేవట. అందువల్లనే ఆయనకు అశ్వఘోషుడు అన్న సార్థకనామం కలిగింది. ఆయన బుద్ధచరిత్ర అన్న గ్రంథాన్ని రాశాడు.





మహా తాత్వికుడైన నాగార్జునుడికి, ఆర్యదేవు డనే ప్రతిభావంతుడైన శిష్యుడుండేవాడు. వారిద్దరూ మొదటిసారిగా కలుసుకున్నప్పుడు నాగార్జునుడి హస్తాల్లో చిన్న నీటిపాత్ర వున్నది. ఆర్యదేవుడు తన చేతిలోని సూదిని అందులో జార్చాడు. ఆ విధంగా ఆర్యదేవుడు, తాను జ్ఞానపులోతుల్ని తెలుసుకో గోరుతున్నట్టు సూచించాడు.

పురాణయుగంలో ఆత్రేయు డనే రుషి, తన శిష్యుడైన అగ్నివేముడికి వ్యాధి కారణాలూ, వాటి నివారణ మార్గం గురించి బోధించాడు. ఆ గురుశిష్యుల సంభాషణే అగ్నివేషసంహిత. ఆ గ్రంథంలో ఎక్కువ భాగం కాల గర్భంలో కలిసిపోయింది.





కనిష్కుడి ఆశ్రయంలో చరకుడు వైద్య శాస్త్రాన్ని గురించి పరిశోధనలు చేశాడు. ఆ పరిశోధనల ఫలితమే, చరక సంహిత. ఓషధుల మూలతత్వం తెలుసుకునేందుకు అతడు హిమాలయాల్లో చాలాకాలం నివశించాడు.

కనిష్కుడి పరిపాలనా కాలంలో కుషానులు, మిగతా భారతజాతులతో జాతి సమైక్యం పొందారు. ఈ కారణం వల్లనే ఆ తరవాత చాలా కాలం వరకూ, పశ్చిమోత్తరదిశ నుంచి మరే అనాగరిక జాతులూ, భారతదేశం మీద దాడి చేయలేకపోయినై.





పురుషపూర్‌లో కనిష్కుడు ఒక గొప్ప స్తూపం కట్టించి, అందులో బుద్ధుడి అస్తికలను భద్రపరిచాడు. ఆనాటి పరదేశయాత్రికులు చెప్పిన సాక్ష్యాధారాలను బట్టి, ఆ స్తూపం ఎత్తు అరవై అడుగులు. ఈనాడు పురుషపూర్ (పెషావర్) పాకిస్థాన్‌లో ఒక ముఖ్య నగరం.

# మంచి ఉపాయం

తులశమ్మ మెడలో ఉన్న పది కాసుల గొలుసు కాస్తా వాళ్ళ బావిలో పడింది. అది నూరడుగుల లోతు బావి. అందులోకి దిగేవాళ్ళు చాలా కొద్దిమంది ఉన్నారు. తులశమ్మ బావిలో చేదవేసి, మునిగిందో లేదో అని తొంగి చూస్తుంటే, కొక్కెం ఊడిన గొలుసు బావిలో పడింది.

బావిలో దిగగల వాళ్ళను తీసిపెట్టమంటే, గొలుసు విలువ తెలిసి, "పది రూపాయలిస్తావా?" అని బేరాలకు దిగారు.

ఇంతలో రంగన్న అటుగా వచ్చాడు. వాడు దొంగతనాలు చేస్తాడని అందరికీ తెలుసు. కాని ఎన్నడూ పట్టుబడలేదు. వాడికి వినపడేటట్టుగా తులశమ్మ, తన గొలుసు సంగతి చుట్టూ ఉన్న వాళ్ళతో విశదంగా చెప్పింది. తనకేమీ పట్టనట్టు రంగన్న సాగిపోయాడు. తులశమ్మ బావిలో దిగే వాళ్ళను అవసరం లేదని పంపించేసింది.

ఆ రాత్రి రంగన్న వచ్చి బావిలోకి దిగి, గొలుసు తీసుకుని పైకి వచ్చిన మరుక్షణం, ఇంటి వెనక దాగిన పదిమంది మనుషులు వచ్చి వాణ్ణి పట్టుకుని, గొలుసు తీసుకుని తులశమ్మకిచ్చి, వాణ్ణి కొత్వాలుకు అప్పగించారు.

కానీ ఖర్చుకాకుండా తులశమ్మకు గొలుసు తిరిగి రావటమే గాక, ఎవరికీ దొరకకుండా తప్పించుకు తిరుగుతున్న రంగన్నను పట్టిచ్చినందుకు అందరూ ఆమెను అభినందించారు.

—ఎ. మధుబాబు






శ్రీకాకుళం జిల్లా తీరప్రాంతంలో ఉన్న బాతుపురం అనే గ్రామంలో ఒక పెద నేరేడు చెట్టు ఉన్నది. దానిమీద చాలా కాకులు చాలా కాలంగా నివసిస్తూ ఉంటున్నాయి. నేరేడుచెట్టుకు కొంత దూరంలో ఒక నీటి కొళాయి ఉన్నది. చెట్టు మీది కాకులు ఆ కొళాయి దిగువన చేరిన నీటిని తాగటమూ, అందులోనే స్నానాలు చేస్తూ ఉండటమూ జరిగేది.

మంచి వేసవికాలం. ఒక పిల్లకాకికి దాహం వేసింది. అది కొళాయి దగ్గిరికి వెళ్ళింది. దాని దిగువన ఒక్క నీటిచుక్క కూడా లేదు. ఎందుచేతనో క్రితం రోజు నుంచీ ఆ కొళాయిలో నీరు రావటంలేదు.

పిల్లకాకి నీటి కోసం తెగతిరిగి, ఎక్కడా నీరు దొరకక, చెట్టు మీదికి తిరిగి వచ్చి, ఒక ముసలికాకితో, "తాతా, తాతా! నాకు చాలా దాహంగా ఉన్నది. నీరు ఎక్కడ దొరుకుతుంది? ఈ చుట్టుపక్కల చాలా దూరం తిరిగి చూశాను, ఎక్కడా కనిపించలేదు," అన్నది.

ముసలికాకి కొంచెంసేపు ఆలోచించి, ఇలా చెప్పింది:

"పూర్వం మన జాతివాడికి ఒకడికి ఇలాగే దాహం వేసిందట. నీటి కోసం తిరగగా, తిరగగా, చివరకు ఒకచోట పెద్ద కడవ అడుగున కొద్దిగా నీరు కనిపించింది. ఆ నీరు దాని నోటికి అందకపోయేసరికి, అది తన ముక్కుతో ఒక్కొక్క గులక రాయే తెచ్చి కడవలో వేసి, నీరు పైకి తెప్పించి, దాహం తీర్చుకున్నదట! అలాగే మనం కూడా నీటి కోసం గాలించి, దాహం తీర్చుకుందాం."

ఇలా అని ముసలికాకీ, పిల్లకాకీ నీటి కోసం ఎగురుతూ బయలుదేరాయి. వాటికెక్కడా నీరు దొరకలేదు గాని, అడుగున

పి. పూర్ణచంద్రరావు

కొంచెం నీరు ఉన్న పెద్ద కడవ కనిపించింది. అదృష్టంకొద్దీ సమీపంలోనే గులకరాళ్ళ గుట్ట కూడా ఉన్నది. అవి ఉత్సాహంగా చెరొక రాయీ ముక్కున కరుచుకుని తెచ్చి కడవలో వేయసాగాయి. ఒక చెంప దాహమూ, మరో చెంప ఎండా బాధిస్తూంటే వాటికి త్వరలోనే నీరసం వచ్చింది, కాని కడవలో నాలుగోవంతు కూడా నిండలేదు. అయినా అవి కథలో కాకిని తలుచుకుని, మరికొంతసేపు రాళ్ళు తెచ్చి కడవలో వేశాయి. అప్పటికిగాని అది తమ వల అయే పని కాదని వాటికి తెలిసిరాలేదు.

"తాతగారూ, మన జాతివాడు ఒంటరిగా ఈ పని సాధించాడంటివే! మనం ఇద్దరం ఉండి కూడా ఈ పని ఎందుకు చెయ్యలేకపోతున్నాం? నువు నన్ను మోసపుచ్చినట్టున్నావు!" అన్నది పిల్లకాకి, బాగా ఆయాసపడిపోతూ.

"నేనేమన్నా చూశానుట్రా? మన ఊరి బడిపంతులే నన్నూ, నిన్నూ మోసపుచ్చాడు. ప్రతి రోజూ పిల్లల్ని చావబాది, పదేపదే ఆ కథ చెబుతూంటే, నేనూ నిజమే కాబోలు ననుకున్నా!" అన్నది ముసలి కాకి.

మరి రెండు కాకులు వచ్చి రాళ్ళు వేసినా, ఆ కడవ నిండి నీరు పైకి వచ్చే లోపల తమ ప్రాణాలు పైకి పోవటం నిశ్చయం అని తేల్చుకుని, కాకులు రెండూ నేరేడు చెట్టుకు తిరిగి వచ్చాయి.



బడిపంతులు అప్పుడే భోజనం చేసి వచ్చి, నడవాలో వున్న వాలు కుర్చీలో పడుకున్నాడు. చెట్టు కొమ్మల్లో వున్న కాకులకు పంతులుతోబాటు నీళ్ళతో నిండిన రెండు కడవలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి, పంతులుగారి ఇంట్లో.

ముసలికాకి తొందర పడవద్దని హెచ్చరించే లోపలే, పిల్లకాకి "కా, కా!" అంటూ వెళ్ళి వాకిట్లో వాలింది.

"ఛా, పాడుకాకి, ఏకంగా ఇంట్లోకే తగలడ్డావా!" అని చీదరించుకుంటూ, అంట్లను దొడ్లోకి తీసుకుపోయింది పంతులు భార్య.

పిల్లకాకికి మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. అది ఆమె వెనకగా పోయి, ఒక చంచాను చప్పున నోట కరుచుకుని, రివ్వున ఎగురుతూ, ఎదురింటి కప్పు మీదికి వెళ్ళింది.

"అయ్యో, చంచా కాకి ఎత్తుకుపోయిందండీ!" అని కేకలు పెడుతూ పంతులు భార్య పరుగుతీసింది.

వాలుకుర్చీలో కునికిపాట్లు పడుతున్న బడిపంతులు చప్పున కళ్ళు తెరిచి, పంచె సవరించుకుంటూ ఆమె వెనకగా పరుగు తీశాడు.

పిల్లకాకి చంచాను కప్పు మీదనే వదిలేసి, చెట్టు మీద ఉన్న ముసలికాకితో సహా పంతులుగారి ఇంట ప్రవేశించింది. రెండూ చెరొక కడవ మీదా కూర్చుని, తృప్తిగా చల్లని నీరు సేవించాయి.

పంతులుగారు పక్క ఇంటి వాళ్ళను అడిగి నిచ్చెన తెచ్చి, కప్పు మీదికి వెళ్ళి, చంచా చేత పట్టుకుని దిగి వచ్చాడు. ఆయన ఇంట్లోకి వెళ్ళగానే తృప్తిగా కడవలలోని నీరు తాగుతున్న కాకులు రెండూ కనిపించాయి.

ఆ రోజు నుంచీ పాత కథ విడిచిపెట్టి, పంతులు పిల్లలకు ఈ కొత్త కథ చెప్పడం ప్రారంభించాడు.

"అయ్యో, ఈ కాలపు పిల్లలకున్న తెలివి మాకు లేకపోయింది," అనుకున్నది ముసలి కాకి.



# ఆదర్శం

శ్రీపతి అనవరతమూ ఆదర్శాలు మాట్లాడే వాడు. కాని వాటిని ఆచరణలో పెట్టే ఉద్దేశ్యం అతనికి లేదు. అందుకు నిదర్శనంగా అతను చీటికీ, మాటికీ కట్నాలు తీసుకోవటం మహా పాపం అని అందరి తోనూ అంటూ, తన పెళ్ళికి సంబంధాలు చూస్తున్న తల్లిదండ్రులతో, యాభై వేలన్నా కట్నం ఇయ్యలేని సంబంధాలు తనదాకా తీసుకు రావద్దని స్పష్టంగా చెప్పేశాడు.

అతని మిత్రుడు రామేశం ఒకసారి అతనితో, " కట్నాలు పుచ్చుకుని పెళ్ళి చేసుకోవటం ద్రోహమంటావు గదా, నువు పెళ్ళి ఎందుకు చేసుకోలేదు? కట్నం తీసుకోని పెళ్ళికొడుకుకు వేల సంఖ్యలో సంబంధాలు వస్తాయే ?" అన్నాడు.

"సంబంధాలు రాకనా ? పిల్ల బాగుండాలని నాకు పట్టుదల ! నిజంగా అందమైన పిల్ల దొరికితే తప్పక పెళ్ళాడతాను," అన్నాడు శ్రీపతి.

ఒకసారి మిత్రులిద్దరూ సంతకు పోయి, సంత నుంచి తిరిగివచ్చి సత్రం చేరారు. ఎదురుగా తిన్నెమీద ఒక అమ్మాయి కూర్చుని ఉన్నది. ఆమె చాలా అందంగా ఉన్నది. శ్రీపతి ఆమెకేసి కన్నార్పకుండా చూడటం గమనించి రామేశం, "ఆ అమ్మాయి బాగానే ఉన్నది కదూ ?" అన్నాడు నిర్లిప్తంగా.

" అద్భుతంగా ఉన్నది, ఎవరో గాని!" అన్నాడు శ్రీపతి.

" ఎవరో కాదు, నా చెల్లెలు గిరిజ! నీకు దాని అందం నచ్చింది గనక, దానికి కట్నం లేకుండా పెళ్ళి అయిపోయి నట్టే! కట్నాలుపోసి దాని పెళ్ళి ఎలా చెయ్యటమా అని మేమంతా మధనపడి పోతున్నాం!" అన్నాడు రామేశం.

శ్రీపతి గిరిజను కట్నం తీసుకోకుండా పెళ్ళాడ వలసి వచ్చింది! —శరత్





# ఎవరు గొప్ప?

అనకాపల్లి జమీందారు చిదంబరంగారి ఇంట్లో, ప్రతి ఆదివారం మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతాన ఇష్టాగోష్ఠి జరుగుతూండేది. అందులో ఊరి పెద్దలు పాల్గొంటూండేవారు.

ఒకనాడు యిష్టాగోష్ఠి సమయంలో జమీందారు, అక్కడ చేరిన పెద్దలతో, "సంఘంలో వైద్యులు, న్యాయాధిపతులు, రక్షకభటాధికారులూ లాంటి ఎందరో ఉద్యోగులున్నారు కదా! వీరిలో ఎవరు గొప్ప?" అని అడిగాడు.

"ప్రాణాల్ని కాపాడతాడు, శరీర బాధల్ని తొలగిస్తాడు, కనక వైద్యుడే అందరికన్నా గొప్ప!" అన్నాడు గ్రామాధికారి లింగయ్య.

"న్యాయనిర్ణయం చేసే న్యాయాధికారి మీద, ధర్మాధర్మాలు ఆధారపడి వుంటాయి. న్యాయంగా తీర్పు చెప్పాలంటే బంధువులకైనా, స్నేహితులకైనా శిక్ష విధించక తప్పదు. అందుచేత న్యాయాధికారే గొప్ప!" అన్నాడు మోతుబరి రైతు నాగయ్య.

"సంఘంలో నలుగురితోబాటు కలిసి వుంటూనే మోసాలతో, దౌర్జన్యాలతో దొంగతనాలూ, హత్యలూ చేసే దుర్మార్గుల్ని నేర్పుగా పట్టుకునే రక్షకభటాధికారే అందరికన్న గొప్ప!" అన్నాడు షావుకారు బంగారయ్య.

కొంచెం దూరంగా నిలబడి వీరందరి మాటలూ వింటున్న జమీందారు నౌకరు సూరన్న, చిన్నగా ఒకసారి దగ్గి, "బాబూ, మీరు చెబుతున్న వాళ్ళందరికన్నా మన ఊరి ముసలి రామప్ప పంతులుగారు గొప్పండీ!" అన్నాడు.

అందరూ వాడి కేసి చూసి కాస్త వెటకారంగా నవ్వారు. జమీందారు వాడితో.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

"ఒరే, సూరన్నా! మన ఊరి పెద్దలు, అంతంత గొప్పవాళ్ళను గురించి చెపుతూండగా, మరెవరూ లేనట్టు, నీకు ఆ ముసలి రామప్ప పంతులుగారు దొరికారా ?" అన్నాడు.

సూరన్న విస్తుపోయి, అంతలోనే సర్దుకుని, "బాబూ, నే నేదో వాదం కోసం అన్న మాటలు కావివి. అబ్బాయి నాని బాబుగారిని దిగబెట్టేందుకు, రోజూ రామప్పగారి ఇంటికి వెళుతూంటాను గదా. అప్పుడాయన పిల్లలకు చదువు చెప్పే తీరు గమనిస్తూంటాను. ఆయన ఒక్కొక్క పిల్లవాడి మనసెరిగి, వాళ్ళ తెలివితేటల్ని పెంచేందుకు, బుర్ర కొక మందు లాంటి విషయం ఎంతో నేర్పుగా వివరించి చెబుతూంటాడు.

"రక్షకభటాధికారి దొంగలయిన వాళ్లను పట్టుకునేందుకు ప్రయత్నిస్తాడు. కాని, రామప్ప పంతులుగారు మాత్రం, ముందే పిల్లలను సరి అయిన మార్గాన పెడుతూంటాడు.

"న్యాయ నిర్ణయం సంగతి కూడా అంతే. తన దగ్గిర చదువు కోసం వచ్చిన పిల్లలలో ధనిక, పేద తారతమ్యాలు చూడడాయన. పిల్లలు తగువులాడారంటే, అప్పటికప్పుడు సంగతేమిటో విచారించి, తప్పు చేసిన వాళ్ళను తగువిధంగా మందలిస్తాడు. ఈ విధంగా వైద్యుడి పనీ, రక్షకభటాధికారి పనీ, న్యాయాధికారి పనీ ఆయన ఒక్కడే చేయటమే గాక ; ముందు ముందు అలాంటి ఉద్యోగాలకు అర్హులైన వాళ్ళను కూడా తయారుచేస్తున్నాడు," అన్నాడు.

సూరన్న చెప్పినదాంట్లో వున్న సత్యం జమీందారుతోపాటు, మిగతావాళ్ళు కూడా గ్రహించి, అతణ్ణి మెచ్చుకున్నారు. ఆ ఏడు ఉగాది పండగకు, ఊరి పెద్దల్లో ఎవరిని సన్మానించాలి అని ఆలోచిస్తున్న జమీందారుకు, సమస్య తీరిపోయింది. ఆయన పండగరోజున పెద్ద ఉత్సవం ఏర్పాటు చేసి, రామప్పపంతులును ఘనంగా సన్మానించాడు.





# ఇద్దరు మోసగత్తెలు

## 3

గాడిదల కుర్రవాడు, తనను గుర్తించి నప్పటికీ, దిలైలా ఏమీ తొణకకుండా, "నువ్వనేదేమిటి, నాయనా?" అన్నది అమాయికంగా.

"నా గాడిద! నా గాడిదను నా కిచ్చి మరీ మాట్లాడు!" అన్నాడు కుర్రవాడు.

"ఎందుకట్లా అరుస్తావు? నీ గాడిదను నేనెత్తుకు పోయాననుకున్నావా? మంగలి మసూదు దగ్గిర దాచిపెట్టా. నా వెంట రా, నీ గాడిదను నీ కిప్పిస్తా," అన్నది దిలైలా. కుర్రాడామె వెంట బయలుదేరాడు. వాణ్ణి దుకాణం బయట ఉండమని, దిలైలా లోపలికి వెళ్ళి, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ మంగలి మసూదుతో, "ఇది నువు కుదర్చవలిసిందే, బాబూ!" అన్నది.

"ఏమిటి, పిన్నమ్మా? అసలు విషయం చెప్పు," అన్నాడు మసూద్.

"అడుగో, నాయనా, బయట ఉన్నాడే వాడు నా కొడుకు, చచ్చేఖాయిలా పడి కోలుకున్నాడు. కాని వాడి బుద్ధి పుచ్చి పోయింది. ఎప్పుడో చిన్నప్పుడు వాడికి గాడిద ఒకటి ఉండేది. దానికోసం ఇప్పుడు ఒకటే కలవరింత! వాడి పిచ్చి నువే నయం చెయ్యాలి," అన్నది దిలైలా.

ఆవిడ చేతిలో పెట్టిన దీనారం తీసుకుంటూ మసూద్, "అదెంత పని? తల గొరిగేసి నిమ్మకాయరసం అంటానంటే మూడు పూటల్లో గుణం ఇస్తుంది," అన్నాడు.

"మంచి మాటలతో వాణ్ణి పిలిచి చికిత్స చెయ్యి, నాయనా! నీ రుణం ఉంచుకోనులే!" అన్నది దిలైలా.

మసూద్ దుకాణం బయటికి వచ్చి, కుర్రాణ్ణి చూసి, "లోపలికి రా!" అన్నాడు.

"నా గాడిద?" అన్నాడు కుర్రాడు, కోపంగా.

"నీ గాడిద నా దగ్గిరే ఉంది. అదెక్కడికి పోతుంది? ఒక్క క్షణం లోపలికిరా!" అన్నాడు మంగలి మసూద్.

కుర్రాడు వసారాలోకి రాగానే మసూద్ నౌకర్లు వాణ్ణి పెడరెక్కలు విరిచికట్టారు. మసూద్ వాడి తల యావత్తూ నున్నగా గొరిగి, నిమ్మరసం అంటాడు. కుర్రాడు పెద్దగా కేకలు పెట్టసాగాడు.

మసూద్ చికిత్స పూర్తి చేసి తన దుకాణం లోపలికి పోయి చూసేసరికి ముసలిదాని జాడ లేకపోగా, కత్తులూ, అద్దాలూ, కత్తెరలూ, తల నూనెలూ, మర్దన తైలాలూ, అత్తరులూ, బల్లలూ, కుర్చీలూ, సమస్తమూ మాయమయాయి.

మసూద్ కుర్రాడి దగ్గిరికి వచ్చి గొంతు పట్టుకుని, "మీ అమ్మ ఎక్కడరా, పిశాచమా?" అని అడిగాడు.

"మా అమ్మపోయి ఎంత కాలమాయె! నా గాడిద నిస్తానన్నావు, వెంటనే ఇచ్చెయ్యి," అన్నాడు కుర్రాడు.

వీళ్లిట్లా ఘర్షణపడే సమయంలో మిగిలిన వాళ్ళు కూడా అనుకున్న ప్రకారం ఆ దుకాణం చేరుకున్నారు. జరిగినదంతా తెలుసుకున్నాక ముసలిది మరొక మోసం చేసిందని తేలింది. మంగలి మసూద్‌తో



కూడా కలిసి అందరూ ముసలిదాన్ని పట్టుకోవటానికి బయలుదేరారు.

వారు చాలా వీథులు తిరిగి ఒక చోటికి వచ్చేసరికి, గాడిదగల కుర్రవాడికి దిలైలా మళ్ళీ కనిపించింది. వాడు చప్పున ఆమె మీద పడి పట్టుకుని, "ఇదుగో, ముసలి ముండ! ఈసారి తప్పించుకు పోనివ్వకండి!" అని అరిచాడు.

అందరూ కలిసి ఆమెను పట్టుకుని ఖాలిద్ ఇంటికి తీసుకుపోయి, అక్కడి భటులతో, "మేము ఖాలిద్‌గారి దర్శనం వెంటనే చెయ్యాలి," అన్నారు.

ఖాలిద్ నిద్రపోతున్నాడు. ఆయన లేచేదాకా ఆగమని భటులు మగవారి



నయిదుగుర్నీ బయట ఆవరణంలో కూచోబెట్టి, దిలైలాను జనానా భాగంలో ఒక గదిలోకి పంపించారు. దిలైలా ఆ గదిలో నుంచి ఇంకా లోపలికి వెళ్ళి, ఖాలిద్ భార్య ఉండే చోటికి పోయింది. ఆమెకు సలాం చేసి, ''మా దగ్గర వున్న బానిసలను మీ భర్తగారు పన్నెండు వందల దీనారాలకు బేరం చేశారు. వారిని వప్పగించటానికి తీసుకొచ్చాను. వారు నిద్రలేచేసరికి ఏవేళ అవుతుందో?'' అన్నది.

ఖాలిద్ భార్య, ''ఆ సంగతి నాకు తెలియదు గాని బానిసలను కొంటానని మాత్రం నాతో ఎప్పుడో అన్నారు. అయినా, మీ బానిసలెక్కడ?'' అని అడిగింది.

''బయటే వున్నారు. కిటికీలో నుంచి చూస్తే కనిపిస్తారు. అందరూ మంచి పుటక గలవారే లెండి,'' అన్నది దిలైలా.

బయట నిలుచున్న వారినందరినీ కిటికీలో నుంచి చూసి ఖాలిద్ భార్య చాలా తృప్తి పడింది. ఆవిడ దిలైలాతో, ''డబ్బు నేనే ఇద్దును గాని, నా దగ్గిర వెయ్యి దీనారాలే ఉన్నాయే, ఏం చెయ్యను?'' అన్నది.

''వెయ్యి చాలుగదండీ? రెండు వందలు అదివరకే బయానాగా తీసుకున్నాగా?'' అన్నది దిలైలా. ఆమె వెయ్యి దీనారాలూ పుచ్చుకుని సలాం చేస్తూ, ''కూచోబెట్టకుండా నా పని ముగించి చాలా పుణ్యం కట్టుకున్నారు. నాకు మా బానిసల ముఖాలు చూడటానికి చాలా బాధగా వుంది. మీరు మరోలా అనుకోక, నన్ను దయచేసి దొడ్డిదారిన పంపించెయ్యండి,'' అని కోరింది.

ఖాలిద్ నిద్ర లేచాక ఆయన భార్య, ''మొత్తానికి చాలా మంచి బేరమే చేశారే?'' అంటూ, బానిసల సంగతి చెప్పి అభినందించింది.

అంతా విని ఖాలిద్ విస్మయంతో, ''బానిసలేమిటి? బేరమేమిటి? నే నెవరికీ బానిసల్ని కొనేందుకు బయానా ఇవ్వలేదే!'' అన్నాడు.

"అదేమిటి ? నేనా ముసలావిడకు వెయ్యి దీనారాలు ఇచ్చేశాను. ఆమె వదిలివెళ్ళిన బానిసలు కింద వున్నారు," అన్నది ఖాలిద్ భార్య. ఖాలిద్ గబగబా కిందికి వెళ్ళి, తనకోసం వేచి వున్న దుకాణదారునూ, కలంకారీ వాణ్ణీ, రత్నాల వర్తకుణ్ణీ, మంగలి మసూద్‌నూ, గాడిదగల కుర్ర వాణ్ణీ చూసి, చాలా ఆశ్చర్యపడ్డాడు.

"మీరేనా నేను కొన్న బానిసలు ?" అని ఆయన వారినడిగాడు.

"మేము బానిసలమా ? ఖలీఫా నడుగుదాం పదండి !" అన్నారు వారు.

ఆ సమయానికే ముస్తఫా కూడా అక్కడికి వచ్చాడు. ఈ లోపుగా ఆయన తన భార్యకు ముసలిది చేసిన మోసం తెలుసుకున్నాడు. ఆయన ఖాలిద్‌తో, "మీ నిర్వాహకం కింద ప్రతి ముసలి తొత్తూ తన ఇష్టం వచ్చిన కొంపలో జొర బడి అమాయక స్త్రీలను మోసం చెయ్య వచ్చులా కనబడుతుంది ! నా భార్యకు జరిగిన మోసానికి ఏమి సంజాయిషీ ఇస్తారు ?" అని అడిగాడు.

ఖాలిద్ కంగారుతో, "అయ్యా, ఈ ముసలిదాన్ని శిక్షించే భారం నేను మీద వేసుకుంటాను. మీ అందరికీ దాని వల్ల జరిగిన నష్టానికి పరిహారం ఇచ్చుకునే పూచీ కూడా నాదే !" అన్నాడు.



ఆయన మిగిలిన అయిదుగురి కేసి తిరిగి, "మీలో ముసలిదాన్ని గుర్తించగల వారెవరు ?" అని అడిగాడు.

అయిదుగురూ గుర్తించగలమన్నారు. "మా వెంట పదిమంది భటులను పంపారంటే దాన్ని పట్టితెస్తాం కూడా!" అన్నారు వాళ్ళు ఖాలిద్‌తో.

వారు భటులను వెంటబెట్టుకుని, కొద్ది దూరం వెళ్ళారో లేదో దిలైలా వారికెదురు పడి, వారిని చూసి పారిపోబోయింది. కాని వారు వెంట తరిమి ఆమెను పట్టు కుని, చేతులు వెనక్కు విరిచికట్టి ఖాలిద్ వద్దకు తీసుకుపోయారు. దిలైలా ఆట కట్టినట్టే కనబడింది.

ఖాలిద్ దిలైలాను దొంగతనాల విషయం ప్రశ్నించగా, "మీరడిగేది నా కర్థం కావటం లేదు. నేను నా జన్మలో దొంగతనమన్నది చేసి ఎరగను," అన్నది.

అప్పటికే పొద్దుగూకింది. ఆ రోజుకు ఆమెను విచారించే వ్యవధిలేదు. ఆమె చేసిన దుండగాలు చాలా ఉన్నాయి. విచారించవలసిన సాక్షులు చాలామంది ఉన్నారు. ఆమె ఒకంతట తన నేరం ఒప్పుకునేటట్టు లేదు. అందుకని ఆ రాత్రి ఆమెను ఖైదులో చీకటి కొట్లో వేసి ఉంచినట్లయితే తెల్లవారి విచారణ జరుపుదామనుకున్నాడు ఖాలిద్. కాని జైలు అధికారి ఆమెను గురించి బాధ్యత వహించటానికి ఒప్పుకోలేదు. "ఇంత దొంగది ఏదో ఉపాయం చేసి ఖైదు నుంచి తప్పుకుంటే నా పీకపోతుంది," అన్నాడాయన.

"అదీ నిజమే. విచారణ జరిపేదాకా ఈ ముసలిదాన్ని నలుగురికీ కనిపించే చోటనే ఉంచి కాపలా కాయటం మంచిది," అన్నాడు ఖాలిద్. ఆయన గుర్రం ఎక్కి బయలుదేరాడు. అయిదుగురు ఫిర్యాదీలూ దిలైలాను ఈడ్చుకుంటూ ఆయన వెనకగా నగరం వెలపలకు వెళ్లారు. అక్కడ బయలు ప్రదేశంలో ఆమె నొక స్తంభానికి కట్టేయించి అయిదుగురినీ ఆమెకు కాపలా పెట్టి ఖాలిద్ నగరంలోకి వెళ్లిపోయాడు.

అయిదుగురూ ఆమె చుట్టూ కూచుని చాలాసేపు తిట్లతో కసి తీర్చుకున్నారు. కాని భోజనాలు చెయ్యగానే అందరికీ నిద్ర ముంచుకొచ్చింది, ఎందుకంటే వారికి మూడు రాత్రులుగా నిద్ర అన్నది లేదు.

అర్ధరాత్రి దాటిన చాలాసేపటికి ఆ ప్రాంతానికి ఇద్దరు వచ్చి కలుసుకున్నారు. ఒకడు నగరం వదిలిపోతున్నాడు. రెండో వాడు నగరానికి చేరుతున్నాడు. ఇద్దరూ ఆగి మాట్లాడుకోసాగారు. వారు మాట్లాడుకునే మాటలన్నీ దూరాన ఉన్న దిలైలాకు వినిపిస్తున్నాయి. —(ఇంకావుంది)





# విఘ్నేశ్వరుడు

తారకాసురుడి నిరంకుశత్వానికి తోడుగా, త్రిపురాసురులనే ముగ్గురు రాక్షసులు తపస్సులు చేసి వరాలు పొంది ఆకాశంలో ఎగురుతూ తిరిగే మూడు పట్టణాలను నిర్మించుకొని, ముల్లోకాల మీద విరుచుకుపడ్డారు. మూడు పురాల మీద ఎగురుతూ అగ్నిగోళాల్ని కురిపిస్తూ, పట్టణాలనూ, పచ్చని పల్లెలనూ తగలబెడుతూ విధ్వంసకాండ సాగిస్తున్నారు. జగత్తు అట్టుడికిపోతున్నది. వారిని అంతమొందించగలవాడు శివుడొక్కడే అని తెలిసిన దేవతలు అంతా కలసివచ్చి, మందిర ప్రాంగణంలో హోరెత్తి ప్రార్థనలు చేశారు. పెళ్లాడిన కొత్తలోనే ఏదో బెడద వచ్చిందని శివుడు విసవిసలాడినా, త్రిపురాసురులు చేస్తున్న మారణహోమం విన్నమీదట ఉద్రేకం పుట్టి మూలనున్న త్రిశూలాన్ని దుమ్ము దులిపి పట్టుకొని, తన అనుచరుల్నీ, ప్రమథగణాలనూ వెంటబెట్టుకొని, త్రిపురాసురులను తుదముట్టించడానికి కదిలాడు.

అదేసమయంలో జడల ఏనుగుగా మారి లోకాన్ని భీభత్సంచేస్తూ, ఒక రాక్షసరాజు బయలుదేరాడు. ఏనుగు రూపం కారణంగా అతడికి గజాసురుడు అన్న పేరువచ్చింది. అతడు గొప్ప శివభక్తుడు. శివుడి వల్ల తప్ప మరెవరివల్లా చావులేని వరం పొందాడు

"శివుణ్ణి నీ లోపలే ఉంచేసుకొంటే మరీ మంచిది గదా!" అని నారదుడు

3. పుత్రగణపతి



గజాసురుడి మేలు కోరుతున్న వాడిలాగా అతడితో చెప్పాడు. గజాసురుడు వెంటనే ఉగ్రమైన ఆరాధనతో శివుణ్ణి గూర్చి తపస్సు మొదలు పెట్టి శివుణ్ణి మెప్పించాడు. త్రిపురాసుర సంహారానికని బయలుదేరిన శివుడు గజాసురుడి కోరిక ప్రకారం గజాసురుడి గుండెలో లింగ రూపంతో ఉండిపోయాడు.

''శివుడు గజాసురుడి గుండెలో ఉండిపోతే త్రిపురాసుర సంహారం ఎలా జరుగుతుంది ? నవ వధువు పార్వతి ముచ్చట తీరేదెలా? శివుడికీ, పార్వతికీ పుట్టవలసి ఉన్న వాడి వల్లనే కదా తారకాసురుడి అంతం జరగాలి ?'' అని దేవతలు అంతా దిగులు ముఖాలు వేస్తూంటే నారదుడు, ''శివుడు ఉబ్బులింగడు కదా!'' అని ఉపాయం అందించాడు. దేవతలంతా గజాసురుడి ఎదట శివుణ్ణి పొగుడుతూ స్తోత్రపాఠాలు మొదలుపెట్టారు.

గజాసురుడు కూడా తన్మయుడై వారితో కలిసి శివభజన సాగించాడు. శివలింగం ఉబ్బి అలాఅలా పెరిగిపోతూ గజాసురుడిని చీల్చివేసింది. శివుడు ఇవతల పడ్డాడు. గజాసురుడు కన్నుమూస్తూ, ''నిన్ను నమ్ముకొంటే ఇలా చేశావేమిటి!'' అని శివుణ్ణి నిందించగా, ''గజా! శివభక్తికి తార్కాణంగా కలకాలం నీ పేరు నిలిచేలాగ ఏనుగుతల నాకు సన్నిహితంగా ఉంటుంది. గజచర్మాన్ని కట్టుకుంటాను,'' అని శివుడు చెబుతూ గజాసురుడిని తనలోకి తీసుకొని కైవల్యాన్ని ప్రసాదించాడు.

శివుడు భూమిని రథంగా, సూర్యచంద్రుల్ని రథచక్రాలుగా, వేదాలు గుర్రాలుగా, బ్రహ్మసారథిగా, మేరు పర్వతాన్నిధనుస్సుగా, విష్ణువును బాణంగా సమకూర్చుకొని, తన అనుచరులైన నందీ, శృంగీ, భృంగీ మొదలైన ప్రమథ గణాలను వెంట వేసుకొని, ముక్కోటి దేవతలు వారివారి దేవేరులతో సహా వెనుక రాగా, భయంకరులైన త్రిపురాసురులపై యుద్ధానికి వెళ్ళాడు.

ఇంట్లో వంటరి పార్వతికి కాలం బరువుగా గడుస్తున్నది. శివుడు ఎప్పుడు వచ్చేదీ తెలీదు. ఆ సమయంలో నారదుడు వచ్చి, "అమ్మాయి పార్వతీ! శివుడు నిన్ను పెళ్ళాడినప్పట్నించీ తారకాసురుడు తల్లడిల్లిపోతూ పీడకలలు కంటున్నాడు. నీకు ఎలాంటి హాని తలపెడతాడోయేమో. వాడికి వజ్రదంతుడు తోడై ఉన్నాడు. వజ్రదంతుడు బహుమాయావి! నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలిసుమా!" అని హెచ్చరించి వెళ్ళాడు.



పార్వతికి మరింత చిరాకు, దిగులు కూడా కలిగాయి. చక్కగా తలంటు స్నానం చేస్తే చిరాకు తగ్గి బాగుంటుందనిపించింది.

పార్వతి నలుగు పెట్టుకొని, ఆ నలుగు ముద్ద కూడదీసి, ఆ ముద్దతో ఒక బొమ్మ చేసి ముచ్చటగా చూసుకొని అలా కిందపెట్టి అటు తిరిగి ఇటు చూసేసరికి బొమ్మకు మారుగా ముద్దులుమూటగట్టే బాలుడు కనిపించాడు. "ఎవరబ్బా, నీవు?" అని పార్వతి అడిగింది.

"నీ కాంతిని పుణికి పుచ్చుకొని రాలిన నలుగుముద్దనే కదుటమ్మా! నీ పుత్రుణ్ణి, పుత్రగణపతిని!" అన్నాడు బాలుడు. పార్వతి బాలుణ్ణి అక్కున చేర్చుకొని ముద్దాడి, ఒక అంకుశ గదా దండాన్ని అతని చేతికిచ్చి, "నాయనా! ఎవ్వరినీ, పురుగునైనా రానీయకు!" అని చెప్పి సింహద్వారం దగ్గిర కాపలా ఉంచింది.

"అమ్మా! తినడానికేమైనా పెట్టవూ," అని అడిగాడు కుర్రవాడు. అప్పటికప్పుడు పిండి కలిపి చలిమిడి ముద్దనూ, ఉండ్రాళ్ళనూ చేసి ఇచ్చి పార్వతి స్నానానికి వెళ్ళింది.

పార్వతిని అంత మొందించితే శివుడికి కొడుకు పుట్టే అవకాశం లేదు, తన ప్రాణానికి భయం ఉండదని తలచి తారకాసురుడు వజ్రదంతుణ్ణి పార్వతిని అపహరించుకొని రమ్మని పురమాయిం



చాడు. వజ్రదంతుడు వజ్రాయుధాన్ని పరపరకొరికి పారేయగల వాడికోరలు గల పెద్ద రాక్షసి ఎలుక రూపంతో కొండల్ని డొల్చి పిండిచేస్తూ, మూషికాసురుడు అని కూడా పేరు పడ్డాడు. పార్వతిని అపహరించుకు రావడానికి ముందు గజకర్ణి, గోకర్ణి అనే తన ముఖ్యానుచరులైన రాక్షసులిద్దర్ని పంపించాడు.

వాళ్లు దున్నపోతుల్లా బలిసిన కుర్రాళ్ళ రూపంతో వెళ్లి, దొంగచూపులు చూస్తూ, సింహద్వారం దగ్గిర అంకుశ గదాదండాన్ని పట్టి అటూ ఇటూ తిరుగుతూ కాపలా కాస్తున్న బాలుణ్ణి, "ఆడుకుందాం రా!" అని పిలిచారు.

బాలుడు వాళ్ళను చూడనట్టే చూసి, నవ్వుతూ, "ముందు కాస్త తినండిరా!" అంటూ రెండు చలిమిడిముద్దలు వాళ్ళ మీదకు విసిరాడు. వాళ్ళు తలలు దిమ్మ తిరిగి పారిపోబోతూంటే, రెండు ఉండ్రాళ్లు పెద్ద బండరాళ్లై వాళ్ళముందు పడగా బోర్లా పడ్డారు. పుత్రగణపతి వాళ్ళను పిలిచి, "చెవులు పట్టుకొని మూడేసి గుంజీలు తీసి, లెంపలేసుకొని మరీ పొండిరా!" అని ఆజ్ఞాపించాడు. వాళ్ళు లాగే చేసి, రాక్షస రూపాలతో వజ్రదంతుడికి ఎగఊపిరితో జరిగింది చెప్పారు.

వజ్రదంతుడు హుంకరించి ఎలుక రూపంతో వెళ్లి ద్వారానికి సమీపంలో బొరియచేసి దూరబోతూండగా పుత్రగణపతి మొలపాశాన్ని తీసి ఉచ్చు పన్ని విసిరి మూషికాన్ని పట్టాడు. ఉచ్చు మెడకు బిగిసి కీచుకీచుమంటూన్న దాని నెత్తిన నాలుగు మొట్టికాయలు పెట్టి, తోక పట్టుకొని గిరగిరా తిప్పి విసిరేశాడు.

పుత్రగణపతి విసురుకి మూషికాసురుడు అమాంతంగా అతని రాజ్యంలో అంతఃపురం ముందు దభీమని నిజరూపుతో బోర్లాపడ్డాడు. అతని భార్య ధవళ గొప్ప దేవీ భక్తురాలు. ఎప్పటికీ తన పసుపు కుంకుమలు నిలిచేలాగ భర్తకు చావులేని వరం దేవివల్ల పొందింది! ధవళ భర్తను

ఊరడించి వరం సంగతి చెప్పి ధైర్యం కలిగించి, పార్వతి జోలికి పోవద్దని హితవు చెప్పింది.

*　　*　　*

త్రిపురాసురులను సంహరించి ముందుగా వచ్చిన శివుడు పార్వతిని చూడాలనే తహతహతో హుటాహుటిగా వెళ్ళబోతూంటే బాలుడు అడ్డగించాడు. శివుడు చకితుడై, "ఎవరునువ్వు?" అని గద్దించాడు.

బాలుడు పకపక నవ్వుతూ, "అమ్మ కొడుకుని! మాయావులూ, వేషధారులూ తిరుగుతున్నారు, పురుగైనా పోకుండా కాపలాపెట్టింది, మా అమ్మ!" అన్నాడు.

"నేను ఈశ్వరుణ్ణి, దేవుణ్ణి!" అన్నాడు శివుడు.

"నాకు ఎటువంటి దేవుడితోనూ నిమిత్తం లేదు. అమ్మ ప్రకృతి స్వరూపిణి; ప్రకృతి శాసనాన్ని అనుసరించి నడుచు కోవడం కంటే జీవకోటికి వేరే ధర్మమేదీ లేదుకదా! అమ్మ ఆజ్ఞ పాలించటమే నా విధి!" అన్నాడు బాలుడు.

కొంచెం వెనక నుంచి త్రిపురాసుర సంహారం చేసిన శివుడి పరాక్రమవీర గాథను గానం చేస్తూ జయజయ ధ్వానాలతో వస్తూన్న ప్రమథగణాలు, ముక్కోటి దేవతలు అక్కడికి చేరుకొని,




శివుడు బాలుడితో ఘర్షణ పడుతూండడం చూసి ఆశ్చర్యంతో బొమ్మల్లాగ నిల్చిపోయి, వాళ్ళ సంవాదం వినసాగారు.

"కుర్రకుంకవు, తెలియక దేవుడు లేడంటున్నావు. అంతటికీ మూలము పరబ్రహ్మము, అతడే దేవుడు!" అన్నాడు శివుడు. "పెద్దవాడివైనా నీకే తెలియ నట్టుంది. ఆదిశక్తి నుండి విశ్వమూ, త్రిమూర్తులూ వచ్చిన సంగతిని సూక్ష్మంగా చెబుతాను విను," అంటూ బాలుడు చెప్పసాగాడు:

ఆదిశక్తి రూపుదాల్చి బ్రహ్మను, విష్ణువును, మహేశ్వరుణ్ణి తన మేను విదల్చగా వచ్చిన ఎరుపు, నీలం, తెలుపు



రంగుల తేజస్సుల నుండి పుట్టించింది. బ్రహ్మ, విష్ణువు లిద్దరూ దేవి చెప్పింది వినకుండా ధిక్కరించారు. వాళ్లను ఆమె తన మూడో కంటిని తెరిచి బూడిద కుప్పల్ని చేసింది. మహేశ్వరుడు గడుసు వాడు; చెప్పినట్టే వింటానుగాని, ముందు మూడోకన్ను తనకు ఇమ్మన్నాడు. దేవి తన మూడో నేత్రాన్ని తీసి అతని నొసట అతి కించింది. వెంటనే అతను దాన్ని తెరిచి ఆవిణ్ణి కాల్చాడు. ఆమె మండిపోతూంటే అగ్నిరేణువులు విరజిమ్ముకొని తేజో మండలాలు ఏర్పడ్డాయి. భస్మం రేగి అంతటా నిండింది. ఆ విధంగా విశ్వం ఏర్పడింది. తర్వాత కాలినట్టే కాలి పోయిన దేవి మళ్ళీ యథారూపంలో కనిపించింది. అందుకే ఆమెను 'మహా మాయ' అని అన్నారు. మహేశ్వరుణ్ణి మెచ్చుకొని, అతణ్ణి లయకారుడుగా నిర్ణ యించింది. బ్రహ్మ, విష్ణువులను వారి బూడిదల నుండి రప్పించింది. కొంత మిగిలివున్న తన బూడిదను మూడు భాగాలు చేసి వాణిని, లక్ష్మిని, ఉమను రూపొందించింది. వాణిని బ్రహ్మ, లక్ష్మిని విష్ణువు, ఉమను మహేశ్వరుడు అర్ధాంగు లుగా స్వీకరించి లోకపాలన చేయండని చెప్పి, దేవి అంతర్ధానమైంది.

"నీవు చెప్పిందంతా ఒట్టి కటుకథ!" అన్నాడు శివుడు.

"నాది కట్టుకథ అయితే బ్రహ్మము దేవుడు అంటూ నీవు చెప్పేదంతా కేవలం మెట్టవేదాంతం అంటే తప్పేముంది? అంతా దేవుడు నుండి పుట్టిందనడం కంటే ఆదిశక్తి నుండి వచ్చిందనడం ఎక్కువ నిజంగా వినిపించడం లేదా!" అని అడిగాడు బాలుడు. అతని మాటలకు అక్కడున్న మగవాళ్ల ముఖాలు వెలవెల పోయాయి. ఒక్క విష్ణువు మాత్రం మెచ్చుకుంటూన్నట్లుగా బాలుణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు. బ్రహ్మ బాలుడి తర్కానికి మురిసిపోయాడు. ఆడవాళ్ళ ముఖాలు కళకళలాడుతూ వికసించాయి.

శివుడు ముఖం ఎర్రగా చేసుకొని, "చూస్తే పసివాడివైతివి, భయపడకు, నిన్నేమీ చేయనులే! మంచిగా ద్వారానికి అడ్డం తొలగిపో!" అన్నాడు కసురుతున్నట్టుగా. "నా కంఠంలో ప్రాణం ఉండగా నిన్ను వెళ్ళనిచ్చేది లేదు!" అన్నాడు బాలుడు నిర్భయంగా. శివుడికి పట్టరాని కోపం వచ్చింది. చప్పట్లుచరిచి ప్రమథగణాలకు సైగచేశాడు. బాలుణ్ణి ఈడ్చిపారేయడానికి వాళ్ళు ముందురికారు.

బాలుడు నవ్వుతూ, "పసివాడివంటూ కనికరించినట్లే నటిస్తూ నా మీదకు నీ గణాల్ని బలప్రయోగానికి ఉసిగొల్పడం ఏమైనా బాగుందా? సరే, నేనూ గణాధిపతినే!" అంటూ అంకుశదండాన్ని నేలకు గట్టిగా తాటించాడు. నేల ఈనినట్లు పుత్రగణపతి లాంటి రూపురేఖలు గల వాళ్ళు వేలకువేలు పుట్టుకొచ్చి, నందినీ, శృంగినీ, భృంగినీ, చండీశ్వరుణ్ణీ తమ చేతులో ఉన్న అంకుశాలు, గదలు, పాశాలు, శూలాలతో గొడ్లను తరిమినట్టు తరిమేశారు. మిగతా శివానుచరులంతా జాడలేకుండా పారిపోయారు. పుత్ర గణపతి గణమంతా అదృశ్యమయ్యారు.

శివుడు రుద్రుడై త్రిశూలం ఎత్తాడు. బాలుడు అంకుశదండంతో అడ్డుకోగా ఖంగున మ్రోగుతూ త్రిశూలం పడిపోయింది. బాలుడు పకపక నవ్వుతూ, "మా అమ్మ ఇచ్చిన దండం నా చేతనుండగా నన్నేమీ చేయలేవు. నీ వేదో చేద్దామనుకుంటున్నది నిర్విఘ్నంగా నెరవేర్చాలనే నేనూ సిద్ధంగా ఉన్నాను, తర్వాత కథ అమ్మ చూసుకొంటుంది!" అంటూ అంకుశగదాదండాన్ని దూరంగా విడిచిపెట్టాడు. శివుడు ఒళ్ళు తెలియని కోపంతో ఉన్మత్తుడిలాగ త్రిశూలాన్ని బాలుడి కంఠానికి గురిపెట్టి విసిరాడు. మరుక్షణంలో బాలుడు, "అమ్మా!" అని పెద్ద పెట్టున అరుస్తూండగా అతని తల తెగి ఆకాశానికి ఎగిరి పెద్ద జ్యోతిగా వెలిగిపోతూ, అంతరిక్షంలో లీనమైంది.





# మిత్రప్రేమ

గంగా తీరాన ఒక గ్రామంలో జయప్రతాపులని ఇద్దరు క్షత్రియ కుమారులుండేవారు. వారు పసితనంనుంచీ కూడా అత్యంత స్నేహితులు. వారు యుక్త వయస్సు వచ్చేవరకు విద్యాభ్యాసం చేసి, ఏ రాజుల వద్దనైనా కొలువు చేసుకోవటానికి చెరొకవేపూ వెళ్ళారు.

వారిలో జయుడు అమరావతీ నగరంలో విదర్భదేశపు రాజు వద్ద కొలువు సంపాదించి, తన శౌర్య విశ్వాసాల చేత తన ప్రభువును మెప్పించి పైకి వచ్చాడు. అదే విధంగా ప్రతాపుడు ఉజ్జయినీ నగరంలో మాళ్వదేశపు రాజు వద్ద కొలువులో ప్రవేశించి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు.

పన్నెండేళ్లపాటు బాల్యమిత్రులు ఒకరినొకరు చూసుకోకుండానే కాలం జరిగిపోయింది. కాని వారు ఒక్కనాడు కూడా ఒకరినొకరు మరవలేదు. అమరావతి నుంచి ఎవరైనా ఉజ్జయినికి పోతుంటే వారి వెంట జయుడు తన మిత్రుడికి అపూర్వమైన వస్తువులు కానుకగా పంపేవాడు. అదే విధంగా ఉజ్జయిని నుంచి అమరావతి వెళ్లే వారి వెంట ప్రతాపుడు జయుడికి కానుకలు పంపుతూండేవాడు.

కొంతకాలానికి జయుడికి తన బాల్యమిత్రుణ్ణి కళ్ళారా చూడాలని తీవ్రమైన కోరిక కలిగింది. అతను రాజుగారి వద్ద సెలవు తీసుకుని బయలుదేరి అమరావతి నుంచి ఉజ్జయినికి వెళ్ళాడు. ప్రతాపుడి ఆనందానికి మేరలేదు. అతను జయుడికి తన ఇంట సమస్తమైన సౌకర్యాలు అమర్చాడు. కాని ప్రతాపుడి సత్కారాలన్నీ బూడిదలో పోసిన పన్నీరుగా మారినట్టు కనబడ్డాయి.



ఆరోజు కారోజు గడుస్తున్న కొద్దీ జయుడు తిండి తినటమూ, నిద్రపోవటమూ మానేసి, చిక్కి నీరసించసాగాడు. దీనికి కారణమేమంటే, ప్రతాపుడి ఇంట జయుడికి ఒక చక్కని ఆడపిల్ల కనిపించింది. ఆమెను చూసినది మొదలు అతనికి ఆ పిల్ల ధ్యాస తప్ప మరొకటి లేకుండా పోయింది.

"ఏమిటిది, జయా ? ఎందుకలా చిక్కిపోతున్నావు ? నీ ఒంట్లో సరిగా లేదా ? వైద్యుణ్ణి పిలిపించనా ?" అని ప్రతాపుడు తన మిత్రుణ్ణి ఆత్రంగా అడిగాడు.

"నీకన్న నాకు ఆప్తులెవరున్నారు ? నిజం చెప్పేస్తాను. మీ ఇంట ఒక అందగత్తెను చూశాను. ఆమెను పెళ్ళాడని పక్షంలో నేను చచ్చి తీరుతాను," అన్నాడు జయుడు.

"ఆ పిల్ల పేరు మనోరమ. ఆమెకు తలిదండ్రులు లేరు. కాని చాలా ఆస్తి గలది. మా యింటనే పెరుగుతున్నది. నేను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను. అయితే నువు ఆమెను ఇంతగా ప్రేమిస్తున్నావు గనక, నువే చేసుకో," అంటూ ప్రతాపుడు జయుణ్ణి బలవంతాన ఒప్పించి, మనోరమనిచ్చి పెళ్ళి చేసేశాడు. మరి కొద్ది రోజులకు జయుడు మనోరమతో సహా ఉజ్జయిని నుంచి అమరావతికి తిరిగి వెళ్ళాడు.

కొద్దికాలం గడిచింది. ఉజ్జయినీ రాజు చనిపోయి యువరాజు సింహాసనం ఎక్కాడు. గిట్టనివాళ్ళు ప్రతాపుడి మీద చాడీలు చెప్పి అతనిని కొలువులో నుంచి తొలగించారు. త్వరలోనే ప్రతాపుడు అతి బీదస్థితికి వచ్చాడు. అతనికి ఏమి చెయ్యటానికీ తోచలేదు. చుట్టుపక్కల అందరూ శత్రువులుగా మారిపోయారు.

ఈ స్థితిలో జయుడు ఒక్కడే దిక్కని పించి ప్రతాపుడు కట్టుబట్టలతో అమరావతీ పట్టణానికి బయలుదేరి వెళ్ళాడు. అతను నగరం ప్రవేశించేసరికి బాగా చీకటి పడింది. "ఈ చీకట్లో, ఈ మాసిన

బట్టలతో, వికృతాకారంతో, పెరిగిపోయిన గడ్డంతో వెళితే జయుడు నన్ను గుర్తి స్తాడో, గుర్తించడో. ఈ రాత్రికి ఎక్కడైనా తల దాచుకొని, రేపు ఉదయం అతన్ని చూస్తాను," అనుకొని ప్రతాపుడు ఆ రాత్రి గడపటానికి దాపుల వున్న ఒక శ్మశానం వేపు వెళ్లాడు.

అక్కడ అతను ఒకచోటు చూసుకుని పడుకున్నాడు. కాని నిద్రపట్టలేదు. ఒక రాత్రివేళ అక్కడికి ఇద్దరు మనుషులు వచ్చారు. వారి సంభాషణ చూస్తూండగానే పోట్లాటగా పరిణమించింది. చివరకు ఒకడు బాకు తీసి రెండోవాణ్ణి పొడవ బోయాడు. రెండవవాడు కూడా బాకు తీసి మొదటివాణ్ణి పొడిచాడు. బాకు దెబ్బతిన్నవాడు పెద్ద కేకపెట్టి పడి పోయాడు. పొడిచినవాడు కంగారుపడి పరిగెత్తుకొంటూ ప్రతాపుడు పడుకున్న వేపుగా వెళ్ళిపోయాడు.

ఇద్దరు వ్యక్తులు పోట్లాడటమూ, ఒకడు మరొకణ్ణి పొడిచి పారిపోవటమూ మొదలైనవి ప్రతాపుడిలాగే, ఆ అపరాత్రి వేళ మరికొందరు కూడా చూశారు. వాళ్ళు హంతకుడు పరిగెత్తిన దిక్కుగా పరుగున వచ్చి ప్రతాపుణ్ణి చూసి, అతనే హంతకుడనుకుని, అతన్ని పట్టుకుని కొత్వాలు వద్దకు తీసుకుపోయారు. కొత్వాలు



ప్రతాపుణ్ణి తెల్లవార్లూ ఖైదులో వుంచి, మర్నాడు భటుల వెంట న్యాయస్థానానికి పంపాడు.

ప్రతాపుణ్ణి వీధి వెంబడి తీసుకుపోతూండగా, జయుడు చూసి గుర్తించి, "ఏమిటిది? ఇతన్ని ఎక్కడికి తీసుకుపోతున్నారు?" అని భటులను అడిగాడు.

"నిన్న రాత్రి శ్మశానంలో ఈ మనిషి మరొక మనిషిని హత్య చేశాడు. విచారణకు తీసుకుపోతున్నాం," అన్నారు భటులు.

"పిచ్చివాళ్లల్లారా, శ్మశానంలో హత్య చేసినవాణ్ణి నేను, ఇతన్ని విడిచేసి నన్ను పట్టుకు పొండి," అన్నాడు జయుడు.



'' ఇతనెవరో నాకు తెలీదు. శ్మశానంలో రాత్రి హత్య చేసింది నేనే, పదండి,'' అన్నాడు ప్రతాపుడు.

భటుల కేమీ పాలుపోక ఇద్దర్నీ పట్టుకుని న్యాయస్థానానికి తీసుకుపోయారు. న్యాయాధికారి ఇద్దరినీ విచారించి కూడా హంతకుడెవరో నిర్ణయించలేకపోయాడు.

'' ఈ యిద్దరిలో ఒకడు హంతకుడు, రెండోవాడు పిచ్చివాడు. ఎవరెవరో నిర్ణయించటం నా తరం కాదు. ఇద్దర్నీ తీసుకుపోయి కొరత వెయ్యండి!'' అని ఆయన చివరకు తీర్పు చెప్పాడు.

భటులు జయప్రతాపుల నిద్దరినీ వధ్యస్థానానికి తీసుకుపోయి, అక్కడికి వచ్చిన కొత్వాలుకు న్యాయాధికారి తీర్పు అందజేశారు. శిక్ష చూడటానికి అమరావతి పౌరులు చాలామంది గుమికూడారు. వారిలో అసలు హంతకుడు కూడా వున్నాడు. అధికారులు తనను పట్టుకోలేక పోగా ఇద్దరు నిర్దోషులను కొరత వేయిస్తూండటం చూసి హంతకుడికి మండిపోయింది. వాడు కొత్వాలు దగ్గిరికిపోయి, '' మీ న్యాయం అఘోరించినట్టే ఉంది! అసలు హంతకుణ్ణి నేను. వీళ్ళిద్దరినీ విడిచిపుచ్చి నన్ను కొరత వేయించండి!'' అన్నాడు.

విచారణ చెయ్యనివాణ్ణి శిక్షించటానికి కొత్వాలుకు అధికారం లేదు. ముద్దాయిల సంఖ్య రెండు నుంచి మూడుకు పెరిగింది. కొత్వాలు ముగ్గురినీ వెంటబెట్టుకొని న్యాయస్థానానికి వెళ్ళాడు.

'' ఈ హత్యానేరం విచారణ చేసి శిక్ష విధించానే?'' అన్నాడు న్యాయాధికారి.

'' ఇప్పుడు మరొక హంతకుడు దొరికాడు. తమరు ముగ్గురినీ కలిపి విచారించండి,'' అన్నాడు కొత్వాలు.

ఈసారి విచారణలో జయ ప్రతాపులు తాము హంతకులు కానట్టు ఒప్పుకున్నారు.

'' నువు హంతకుడవు కానప్పుడు ఔనని ఎందుకన్నావు?'' అని న్యాయాధికారి జయుణ్ణి అడిగాడు.

"అయ్యా, ఈ ప్రతాపుడు నా ప్రాణ స్నేహితుడు. నా కోసం తన సర్వస్వమూ ధారపోసినవాడు. అతన్ని భటులు హత్యా నేరం పైన పట్టుకుని తీసుకుపోతుంటే, అతన్ని తప్పించటానికి ఆ నేరం నా పైన వేసుకున్నాను," అన్నాడు జయుడు.

"నీ మాటేమిటి?" అని న్యాయాధికారి ప్రతాపుణ్ణి అడిగాడు.

"నా మిత్రుడు తానే హంతకుణ్ణి అనే సరికి నమ్మి, అతన్ని తప్పించటానికి హత్యానేరం నా పైన వేసుకున్నాను. అంత కంటె ఏమీ లేదు," అన్నాడు ప్రతాపుడు.

న్యాయాధికారి అసలు హంతకుడి వైపు తిరిగి, "నీ మాటేమిటి? వాళ్ళిద్దరినీ కొరత వేయబోయేదాకా నిజం చెప్పని వాడివి, అప్పుడెందుకు చెప్పావు?" అని అడిగాడు.

"అయ్యా, నా చేత చచ్చినవాడు పాపి, ద్రోహి. అయినా వాణ్ణి ఆత్మరక్షణార్థమై మాత్రమే చంపవలసి వచ్చింది. వాణ్ణి చంపినందుకు న్యాయంగా మీరు నన్ను సన్మానించవచ్చు. కాని అలా చేయరు. కొరత వేస్తారు. అందుకని నేను బయట పడలేదు. కాని నాకు బదులుగా ఇద్దరు మనుషులు, ఏ పాపమూ ఎరగనివారు కొరత పడితే, నేను నరకానికి పోనా? అందుచేత నా నేరం బయటపెట్టాను. నేను బయటపడటానికి కారణం కొత్వాలు గారి సమర్థత కాదు, అసమర్థత," అన్నాడు అసలు హంతకుడు.

న్యాయాధికారి దూరం ఆలోచించి ముగ్గురినీ విడిచి పుచ్చుతూ, "నీవు హత్య చేసినప్పటికీ చాలా యోగ్యుడివిగా కనబడుతున్నావు. నిన్ను వదిలేసినందువల్ల ఇంకా హత్యలు జరగవనీ, నీకు మనుషుల ప్రాణాల పట్ల గౌరవం ఉన్నదనీ గుర్తించి నిన్ను విడిచిపుచ్చుతున్నాను," అన్నాడు.

తరవాత ప్రతాపుడు జయుడి దగ్గిరే ఉండి, అతని ద్వారా రాజుగారి కొలువులో నౌకరీ సంపాదించాడు. అప్పటినుండీ మిత్రు లిద్దరూ ఒకరినొకరు జీవితాంతం దాకా ఎడబాయక, సుఖంగా జీవించారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 మే నెల సంచికలో ప్రకటింపబడును.







S. G. Seshagiri K. Sitharam

- ★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)
- ★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.
- ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/–లు బహుమానం.
- ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎంత మంచి వాసన!

రెండవ ఫోటో : ఏదో దీర్ఘాలోచన!

పంపినవారు : కె. చిట్టి బి. ఏ., అకులవారి తోట, గుంటూరు-4

*బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.*

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

లాలించండి

మీరూ
మురిసిపోండి



"నేనిక చకచకా హోమ్ వర్క్
చేసేస్తాగా. చేస్తేనే, అమ్మ ఎప్పుడూ నాకు
రావల్‌గామ్ ఎక్లైర్స్ యిస్తుందిగా మరి.
నాకైతే కోకో, కోకోనట్, రెండు యిష్టమే.
అమ్మకీను. మరే అమ్మ కూడా
గప్‌చిప్‌గా తింటూంటే చూసా...
గప్‌చిప్‌గా."

**Ravalgaon Eclairs**




ది రావల్‌గామ్ షుగర్ ఫార్మ్ లి. వాల్‌చంద్ గ్రూప్ పరిశ్రమ
హెడ్ ఆఫీసు: కన్‌స్ట్రక్షన్ హౌస్, వాల్‌చంద్ హీరాచంద్ మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038.

Creative Unit-4641 Tel.

# Children's Contest





Kathmandu on any piece of paper. Or write a description of not more than 30 words on Kathmandu. (In English or Hindi) Send it along with coupon from this magazine.

Even if you don't win the contest, FARE WELL IN YOUR EXAMS AND WIN HOLIDAY TO KATHMANDU AS A PRIZE FROM YOUR PARENTS' Do come to Kathmandu for a holiday on our regular package.

If you're under 12 your stay will be free. And your parents will pay only Rs. 333 each for stay in a 3-star hotel and Rs. 222 each for stay in a 2-star hotel or they can come on our special attractive package for 5-star hotel.

## Hurry ; Closing Date 10th April'81

Send entry forms only to
HOLIDAY NEPAL
302. HOTEL AMBASSADOR,
NEW DELHI-110003.
Telephone : 690391/302, Res. 252480
Telex 3277 Cable "CONRESORT"

Entry forms also available at
HOTEL MAURYA PATNA
SOUTH GANDHI MAIDAN, PATNA-800001
Telephone : 22067 Telex 022-214
or
144, HOTEL NEW KENNILWORTH,
LITTLE RUSSLE STREET.CALCUTTA -700071
Telephone : 431730/442647 Telex : 021-3395
or Travel Agent

## Rules

1. The contest is open to all children residing in India, between 8 and 15 years, except those belonging to the families of Holiday Nepal staff and Impressions Advtg. & Mktg. staff. 2. A contestant can send in any number of entries, but each entry must be accompanied by an Entry Coupon. 3. All entries become the property of the Company. 4. The Company is not responsible for entries lost, delayed or damaged in transit. 5. The Company reserves the right to extend the closing date of the contest. 6. The decision of the judges will be final and binding The judges will be eminent personalities drawn from the fields of art, journalism and public life. 7. Winners will be informed through press announcements and by letters sent under certificate of posting.



Name :------------------ Age :---
Address :---------------------------
-----------------------------------
Name of this ---------------
Magazine.

Cut along the dotted line

# Holiday Nepal




Recognised by Indian Airlines & Royal Nepal Airlines

Impressions/H.N. 365